Maa Tatayya Chalam

-Turaga Janaki Rani



September : 2002

Copies : 500

Price : Rs.50/-
$ 4

Published by :
Pratyusha Prachuranalu
Hyderabad

Cover Sketch :
Vasanta Sobha

Design : Suri

Layout :
Siva Datta ✆ 3756406

Printed at :

Saraswathi Offset Printers
Nallakunta, Hyd-44
✆ : 7612180

*Copies available at :*
All leading book stores
(or)
Narender Revelli
29, Journalists' Colony, Rd#3
Banjara Hills, Hyderabad-34
Ph : 040-3351153 Mobile : 98851-51153
email : revelli@rediffmail.com

30/6/...

శ్రీ ...

తాతయ్యా, గీతయ్యా, పాతయ్యా, రోతయ్యా, ఇట్లాంటి మాటలు మానెయ్యి. Famous letters of a famous story writer to his famous story-writrix grand-daughter అని మన correspondence పదిహేను భాషల్లో ప్రచురణమైనప్పుడు, ఈ తాతయ్యలు చూసి ఏమనుకుంటారు?

తాతయ్యా, గీతయ్యా, పాతయ్యా
రోతయ్యా, ఇట్లాంటి మాటలు మానెయ్యి.
Famous letters of a Famous
story writer to his famous story
- writrix grand-daughter అని మన
- correspondence పదిహేను భాషల్లో
ప్రచురణమైనప్పుడు, ఈ తాతయ్యలు
చూసి ఏమనుకుంటారు?

# I

## ఉపోద్ఘాతం

చలం తెలుగు పాఠకులలో ఏనాటికీ ఆసక్తి, ఆరాధనా రేకెత్తించే మహా రచయిత. పాఠకులకంటే కూడా రచయితలలో భావతరంగాలను నిరంతరం ఉవ్వెత్తున చలింపచేసే పున్నమి చందమామ. ఆయనవి నవనవోన్మేషంగా వికసించి విస్మయం గొలిపే భావాలు. మృదుసుమాల వంటి సుస్మిత స్పందనలు, గుండె లోలోతుల్లోకి చొచ్చుకొని స్పృశించే పదును మొనల శరపరంపరలు! చీకట్లో తనలో తాను అనుకోవడానికి కూడా మనిషి బెరుకుపడే మనోభావాలను ఎలుగెత్తి చాటిన సాహసి - అటువంటి చలం కొన్నివేలమంది హృదయాల్లో తిష్టవేసుకుని కూర్చున్నాడు. అలా ఆహ్వానం పలికి, సామీప్యం పొందిన అర్భకులలో నేను ఒకతెను.

చలం పుట్టి 108 సంవత్సరాలైంది. ఆయన పోయి 23 సంవత్సరాలైంది. కానీ తిరువణ్ణామలైలో అంబరాన్ని చుంబిస్తూ, అచలంగా యుగయుగాలుగా పాతుకుని వున్న అరుణాచలం వలె, ఆయన ఆ కొండ ఎదురుగా వున్న కుటీర ద్వారం దగ్గర చిరునవ్వుతో కూచున్న పేద యోగిలాగ నా కళ్లల్లో వెలుగుతున్నాడు. ఇదే అనుభూతి ఎందరికో వుండవచ్చును. నా పులకరింత నాది. కన్నీరు క్రమ్ముతుండే నా మనసు ఆర్ద్రత నాది. ఆయన వున్నన్ని రోజులు, ఆయన దగ్గరకు వెళ్లలేదే అని ఒక చివుక్కు భావం. ఆయన యిక లేదు అని తెలిశాక తప్పు చేస్తున్న భావనపోయి, జీవనపుట మూతబడిన శూన్యం.

> ఆయన యిక లేదు అని తెలిశాక తప్పు చేస్తున్న భావనపోయి, జీవనపుట మూత బడిన శూన్యం. ఎంతో విచిత్రమైన, గుండె తొలిచివేసే శోకం అది.

ఎంతో విచిత్రమైన, గుండె తొలిచివేసే శోకం అది.

నా జీవితంలో ఒక సమయంలో, కనీసం ఒక దశాబ్దంపాటు చలంతో అనవరతం సంభాషిస్తూ, అందమైన సన్నని దారాల లాంటి అనుబంధం పెంచుకున్న కాలం. నా 17 నుంచి 30 ఏళ్ల వయస్సు వరకు అయి వుండొచ్చు. చివరిసారి నా 35వ ఏట, 1971లో వెళ్లి చూశాను ఆయన్ని. ఆ పదేళ్ల కాలంలో ఎందరో అభిమానులకు వ్రాసినట్లే నాకూ పుత్తరాలు రాశారాయన. అంటే నేను వ్రాసిన వాటికి జవాబులు రాశారు. మిగిలిన వారికి ఆయన రాసిన వుత్తరాలు చదవకపోతే 'ఓహో, నేనే ఆయనకి చాలా ముఖ్యమైన మనిషిని' అనుకొనేదాన్ని.

చింతాదీక్షితులు గారికి 1920 దశకంలో ఇంగ్లీషులో రాసిన వుత్తరాలలో తన మనస్సులో మెదలిన ప్రతి ఆలోచన, సమకాలీనులైన కవులు, రచయితలను గురించిన వ్యాఖ్యానాలు వున్నాయి. అంటే అవి తనకోసం వ్రాసుకున్నవి. మిగిలిన మిత్రులకు, అభిమానులకు వ్రాసినవన్నీ తనకోసం కాక, వాళ్లను సంతోషపెట్టడానికే అనిపిస్తుంది. యువతీ యువకులకు ముఖ్యంగా - వారిలో ఆడపిల్లలు తక్కువో, అసలు లేరోగానీ - వారిని మురిపించడానికి, వారి లేత భావాలకు జాలిపడి ప్రత్యుత్తరాలుగా వ్రాసినవే! వారిలో మరి నేనున్నాను.

ఆయన దస్తూరీ, ఆయన రసికత, దగ్గరగా పొదువుకుని చెవిలో సన్నగా వినదించిన ఆప్యాయతా, మెరుపు చురకల్లా చెమకాయించే భాషా విన్యాసాలు, బట్టలు లేని పసిపిల్లల్లా కేరింతలాడే స్వచ్ఛమైన వర్ణనలు, వున్నట్లుండి ఉరికివచ్చే పదాల సెలయేళ్లు, తన అభిమాని కనురెప్పల కదలికను, వూపిరి లయను కూడా అతి సన్నిహితంగా ఎరిగి వున్నట్లు మాట్లాడే గుసగుస శైలి - యిల్లాంటి వుత్తరాలను అందుకొన్నవారు ధన్యులు.

కొంత యిబ్బంది కరమైన, వివాదా స్పదమైన, కుటుంబ అశాంతికి కారణ మైన కాలంలో నాకు ఆయనతో పరిచయం, స్నేహం కలిగాయి.

ఐతే, కొంత యిబ్బందికరమైన, వివాదాస్పదమైన, కుటుంబ అశాంతికి కారణమైన కాలంలో నాకు ఆయనతో పరిచయం, స్నేహం కలిగాయి. దాదాపు యాభై సంవత్సరాల క్రిందటి నా జీవితానికి సంబంధించిన సంగతులు. వాటిని గురించి ప్రస్తావించడం నా కుటుంబంలో ఎంత సంకోచంగా వుండేదో, చలం వుత్తరాలు కూడా అంత దాచి వుంచవలసిన అంశంగానే చాలా ఏళ్లు మిగిలిపోయాయి. మేము నాలుగు యిళ్లు మారినప్పుడు చేరవేసిన కాగితాల్లో మిగిలి వున్నవి ప్లాస్టిక్ కవర్లో వేసి, బీరువా అడుగున పడేశాను. అవి తీసి మళ్లీ చదివే సందర్భం, అవసరం నాకు కనుపించలేదు.

కొన్నేళ్ల క్రితం కవి, విమర్శకుడు, చలం భక్తుడు నాళేశ్వరం శంకరం వచ్చి నాతో ఆ విషయాలు మాట్లాడి, గొప్ప ఆరాధనగా వుత్తరాలు స్పృశించి, చలం రక్తం పరోక్షంగానైనా నాలో ప్రవహిస్తున్నందువలన నేనూ గొప్ప అనే భావన కలుగచేశాక, నేను ఆ వుత్తరాలను పట్టించుకొన్నాను. పేజీలు రాలిపోతున్నాయి, అక్షరాలు చెరిగిపోయాయి. తేదీలు ముందే లేవు.

ఆ తర్వాత ఎందరో చలం భక్తులు నా దగ్గరున్న ఉత్తరాలను, నన్నూ ఆయనతో నేను మసలిన జ్ఞాపకాలను తవ్వించి 'యివి ఎంతో విలువైనవి' అని నాలో అభిప్రాయం నాటారు. అశోకనగర్ లైబ్రరీ ఆవరణలో ఒకసారి, ఆ తర్వాత యువభారతి, తెలుగు విశ్వవిద్యాలయం, టి.వి. ఛానళ్ల కనీసం మూడింట్లో నా యింటర్వ్యూలలో 'నేను - చలం' అనే అంశంమీద నేను కొన్ని గంటలసేపు మాట్లాడాను. నేను ఆయనతో కలిసి పాడిన బ్రహ్మసమాజం గీతాలు పాడాను. జ్ఞాపకాల దారుల్లోకి నడిచి వెళ్లిపోతూ, ఎంతో చలించాను.

చలం గురించి పరిశోధనలు చేసినవారితో నేను పోటీపడలేను. అధ్యయనం చేస్తూ, ప్రతి అక్షరం, సిద్ధాంతం, కథాంశం, పాత్రలు, ప్రేమతత్త్వం, శృంగార అభివర్ణన, స్త్రీ ప్రతిపత్తి, ఆమె జీవిత దుర్భరత్వం వంటి అంశాలపై పుంఖానుపుంఖాలుగా వ్రాసిన పండితులకు నేను సరిరాను. నాకు ఆ సత్తాలేదు, సాహిత్య పరిజ్ఞానం అసలు లేదు. అంచేత 'నేనెరిగిన చలం', నా ఆలోచన, ప్రవర్తనకు ప్రతిస్పందించిన చలం, నాకు తన ఆలోచనల్లో చిన్నచోటు యిచ్చిన చలం గురించే నేను ఎప్పుడూ ప్రస్తావిస్తాను. నాకెంతో ఆయన అర్థమైపోయినాడని, ఒక కృత్రిమ భంగిమ పెట్టే సాహసం నాకు లేదు.

నాకెంతో ఆయన అర్థమైపోయినాడని, ఒక కృత్రిమ భంగిమ పెట్టే సాహసం నాకు లేదు.

'ఆయన నాకు రాసిన వుత్తరాలు విధిగా అచ్చులోకి తీసుకుని రావాలి. ఆ తర్వాత నేను వాటిని మననం చేసుకుని, ఆనాటి నా మనస్థితిని వివరణ చేసుకోవాలి' అని తోచింది. నాకు యీనాడు కొంత స్పష్టంగా కనిపించిన భావాలను ముద్రించకపోతే, యివి ఎప్పటికీ అజ్ఞాతంగానే వుంటాయి. రేపో, ఎల్లుండో నేను కన్నుమూస్తే అవే పోతాయి. పరిశోధకులకు యీ భాగం అందుబాటులోకి తీసుకుని రావడం మంచిది కదా, అనుకొన్నాను.

చలం ఏనాడూ అసందర్భమైన రచయిత కాదు. పరిశోధకులు అన్వేషించే గ్రాసంలో, నా యీ చిన్నపుస్తకం గడ్డిపోచగా కలిసిపోతుంది. ఈ పని నాచేత చేయిస్తున్నవారు నా యిద్దరు కూతుళ్లు, అల్లుడు.

నేను చెప్పినవన్నీ విని, 'నువ్వు చలాన్ని అర్థం చేసికోలేదు' అనవచ్చు. 'ఆయన రాతలను రంగు కళ్లద్దాల లోంచి చదివావు' అనవచ్చు. సంప్రదాయమైన నీ కుటుంబ నేపథ్యం నుంచి బయటపడలేకపోయినావు అనవచ్చును. ఎందరో మధ్యతరగతి సాంసారిక మహిళలలాగ నీవు చలంలోని అశ్లీలతను గర్హించావు. ప్రేమ, కామం, వ్యామోహం, దాంపత్యం, గృహిణీ ధర్మాలు, తల్లి బాధ్యతలు, త్యాగాలు వంటి విషయాల్లో నీ భావప్రగతిలో వెనుకబడ్డావు - అనవచ్చు, అంటారు కూడా. చలం అన్నారు ఆ మాట, తన వుత్తరాల్లో, నా జీవితంలో మార్పులు, పరిణతి గురించి ఆయన ఎంతో స్పష్టంగా వ్రాశారు. 'నువ్వు మారుతున్నావు - లాభంలేదు. చలం అవసరం లేదు' అని స్పష్టంగా అన్నారు.

నా గురించి ఆయన అంత ఆలోచించడమే నా పట్ల నా ప్రాముఖ్యత పెరిగిపోయింది. మిగిలిన మిత్రుల ఉత్తరాల్లో లేని వ్యక్తిగతమైన ప్రేమ, సానుభూతి నాపట్ల తన వుత్తరాల్లో ప్రస్తావించారంటే, అదే ఎంతో గర్వకారణం. సాక్ష్యాధారాలు ఆయన అక్షరాలున్నాయి. నిజాయితీ నిండిన ఆ స్పందన ఎంత గొప్పది!



# II

ఇందాక అన్నాను - చలం 'వీరాభిమానులు, చలం సాహిత్యాన్ని తరచి మణిమాణిక్యాలను వెలికితీసిన పరిశోధకులు, తమ భాష, పాండితీ ప్రకర్షలతో గ్రంథ పరంపరను వెలువరించిన వారితో నన్ను నేను ఎట్టి పరిస్థితులలోను పోల్చుకోలేను. సాటిరాలేను. అందుకే 'మా తాతయ్య చలం' అనే వివాదాస్పదం కానేరని శీర్షిక ఎంచుకున్నాను. దీనికి నాకు ఒకవిధంగా గుత్తాధికారం వున్నది. కారణం ఆయనకి వున్న స్వంత మనుమరాలు, వకుళ - చంపకం - వజీర్ రెహమాన్‌ల కూతురు ఒక్కతే. దాన్ని నేను చిన్నపాపాయిగా చూశాను. చలం నలుగురు అన్నదమ్ములు, నలుగురు చెల్లెళ్ల పిల్లలందరిలో రచయిత అని ముద్రపొందిన వారిలో నేను ఒక్కతెనే మనుమరాలిని అని చెప్పుకోగలను.

ఆయన తమ్ముడు కొమ్మూరి వెంకట్రామయ్య గారి పిల్లలు సాంబశివరావు, ఉషారాణి భాటియా రచయితలుగా పేరుపొందారు. సాంబశివరావు (ఒక్కో చేతికి ఆరు వేళ్లున్న ఉప్పు) డిటెక్టివ్ నవలాకారుడుగా, 'తెలుగు సినిమా', 'మంజూష' అనే అత్యంతాకర్షణీయమైన పత్రికలు ఎంతో జయప్రదంగా నిర్వహించిన వ్యక్తి. కల్తీలేని తన ఆలోచనలు, కావ్యశైలితో జీవన పోరాటంలో నిలబడలేకపోయిన విషాద చరిత అతనిది. నాకు వచ్చిన తెలుగునే ఎంతో గొప్పగా వుందని అనేవాడు.

చలం అన్నదమ్ములు, చెల్లెళ్ల పిల్లలందరిలో రచయిత అని ముద్ర పొందిన వారిలో నేను ఒక్కతెనే మనుమరాలిని

ఉష (చిన్ని) ప్రవాసాంధ్రురాలై, నేషనల్ బుక్ ట్రస్ట్‌లో చేరాక, తన కలాన్ని పక్కకు పెట్టేసింది. కొన్నినెలల క్రితం ఆమె భర్త సుమ్మేందర్‌సింగు భాటియా

కనుమూయడంతో, తనకి ఆ ఢిల్లీలో ఏమీ లేదనే నిర్వేదంలో వున్నది.

మా అమ్మమ్మ ధూళ్ల వెంకటరమణమ్మ గారి పెద్ద అన్నగారు గుడిపాటి వెంకటచలం. కొమ్మూరి సాంబశివరావు, వెంకటసుబ్బమ్మల సంతానంలో అగ్రజుడు. తన అమ్మమ్మ, తాతయ్యలకు గుడిపాటి వారికి దత్తత అయినాడు. వారికి కొడుకులు లేరు. మా ముత్తమ్మమ్మ వెంకటసుబ్బమ్మ గారికి 14 కానుపులని చెప్పుకొనేవారు. తొమ్మిదిమందిలో కనీసం ఏడుగురు 80-90 సంవత్సరాలు బతికారు. అమ్మమ్మ 88 ఏళ్ల వయసులో నా పుస్తకం అంకితం తీసుకున్నారు. చిట్టచివరి చెల్లెలు రాజరాజేశ్వరి (పాప) గారు ఆరేడు నెలల క్రితం మదరాసులో చనిపోయారు. వారందరితోను, వారి కుటుంబాలతోను మా అమ్మమ్మ కంటే ఎక్కువగా మా అమ్మ మందపాకల రాజ్యలక్ష్మికి, నాకూ ఎంతో చనువు. మేము తరచూ మదరాసులో వుండేవాళ్ళం, ఇప్పటికీ వారందరూ నాతో ఎంతో ప్రేమగా వుంటారు.

ఒక్కొక్కరి పరిచయం ప్రస్తావిస్తూ, వారిలోని కళాత్మకత, కృషి, కీర్తిని గురించి వ్రాయడం ఆరంభిస్తే, అది వేరే పుస్తకమవుతుంది. కొమ్మూరి పద్మావతీదేవి, కొడవటిగంటి కుటుంబరావు, చక్కలంక సరళ, బేబీ మల్లిక (చిన్న మల్లీశ్వరి), స్వప్నసుందరి, చక్కలంక పద్మ, సినీతార పూర్ణిమ, ఇంగ్లాండులో డాక్టర్ పద్మ, హిందూస్థానీ సంగీతాచార్యుడు రంగారావు కాదంబరి - వారంతా యీ కుదురులోనివారే.

నేను యీ వాస్తవాలన్నీ పురస్కరించుకొని 'మా తాతయ్య చలం' అని పుస్తకం వేస్తే, బాగానే వుంటుందనిపించింది. వ్యక్తిగత అనుభవాల సంకలనంగా వుంటుందని యీ ప్రయత్నం ఆరంభించాను.

నేను రచయిత్రిని అని యీ పుస్తకం సందర్భంగా చెప్పుకోవడానికి అంతగా అవకాశం లేదు. కారణం చలం నన్ను ఒక రచయిత్రి (writrix)గా చూడలేదు. నాకు చాలాభయం ఆయనకి నేను వ్రాసినవి చూపాలంటే. ఒకసారి 'ఎర్రగులాబీలు' అనే నా కథ, తెలుగు స్వతంత్రలో ప్రచురితమై, సంపాదకుడు గోరా శాస్త్రి నుంచి ఒక ప్రశంసా లేఖ పొందినది, మరో కథ చలం యింట్లో వదిలిపెట్టాను. దానిమీద ఆయన అభిప్రాయం యీ పుటల్లో కనిపిస్తుంది.

చలం నన్ను ఒక రచయిత్రిగా చూడలేదు. నాకు చాలా భయం ఆయనకి నేను వ్రాసినవి చూపాలంటే.

ఆ తర్వాత నేను ఎప్పుడూ నా రచనా పాటవం చూపించుకోవాలని ప్రయత్నించలేదు. ఈశ్వరార్చనలో, వేదనామయ తన్మయత్వంలో జీవిస్తున్న ఆయనకు, నేను గిలికినవేవో యిచ్చి అపచారం



చేయలేదు. గడ్డం కమ్మేసిన ఆ పచ్చని బుగ్గలలో నవ్వు మాయమైపోయేది, నాలాటి సామాన్య రచయితలు తాము వ్రాసినవి చదివి అభిప్రాయాలు యిమ్మని అడిగితే - అచ్చులోను, ప్రసారాలలోను పదిమార్లు 'ప్రముఖ రచయిత్రి' అని హోరుపెడితే, అది చలం దృష్టికి తెచ్చేటంత గొప్పసంగతి కాదు. ముడుచుకున్న లేతాకుపచ్చ, వూదా మెరక కన్నుల్లో మెరిసే తడి ఆరిపోకూడదంటే, ఆయన మనస్సుకి పట్టని సంగతులు, కబుర్లుగానైనా ప్రస్తావించడం నికృష్టమైన స్వార్థం అనిపించుకునేది. నా సంతోషంకోసం, నా గర్వాన్ని పొంగించడంకోసం, నన్ను గురించి ఏవో చెప్పుకుంటూ, విని, మెచ్చుకుని, ఆశీర్వదించమనడం అవివేకం, అమానుషం అని నాకు ఆనాడు అర్థమైనాయి.

అమాయకులు, మంచివాళ్ళు, సాహిత్యరంగంలో నన్ను గుర్తిస్తున్నారంటే యిది యీనాటి లోకరివాజు కనుక. గొప్పవారితో తమకున్న సన్నిహితత్వాన్ని 'సొమ్ము' చేసుకునే చవకబారు స్వార్థానికి నేను పాల్పడుతున్నానేమో అనే భయము నాలో యీ క్షణాన వున్నది.

జేవీ

నీ కార్డు

కొత్త కొత్త నిబంధనలు New ...... Testment ---- రాశాను కదా!

అంత పనా పాపం నీకు! ఇన్ని పనులలో నువ్వు type చేశావంటే, ఏసు మీదో చలం మీదో నీ ప్రేమ తెలుస్తోంది.

ప్రళయం వొచ్చేస్తోంది. నీ కష్టాన్ని నేనెంతో మెచ్చుకుంటున్నాను. ప్రళయంలో too late కాకుండా.

నువ్వూ too late కాకముందే ఆ పుస్తకాల్ని sheetsని పంపించెయ్యి వెంటనే.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం



నీ కార్డు. నిజం ఎంత అరుదైపోయింది! దాన్నిస్తానే చమత్కారం కూచుంది.

తొందరేం లేదు. టైపుచెయ్యాలి అనేది జ్ఞాపకం వుంది. ఆ పని జరుగుతూ వుంటే చాలు.

ఇప్పుడందరూ ఇక్కడ ఎట్లా వున్నారో, ఎంత మంది వున్నారో! ఒక్కరికి తీరుబడి లేదు. మెచ్చేవారు పోయేవారు - పని మనిషి కూడా లేదు. కొత్తవారు పాతవారు అందరూ కలిసి అన్నిపనులూ చేసుకుంటారు. సినీమాలకి వెళ్లడానికి వ్యవధిలేకపోతే, పుస్తకాలు చదవడానికి వుంటుందా యోచించు.

ఇక్కడ మా ఇంట్లో బడి తెరిచాడు ఈశ్వరుడు. ప్రతివారు విద్యార్థులో, ఉపాధ్యాయురాలో, కొందరు రెండూను.

నీ కథ ఒకటి చదివాను అప్పుడు. ఏం బాగాలేదు, ఈనాటి రకం కథలు నాకు బావుండటంలేదు. నేను చాలా పాతరకంవాణ్ణి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం.

9/17.

[illegible]

నీ కార్డు. కార్డు రాయడానికి నరకంలోనైనా టైం లేదంటే నేను నమ్మను. కొత్త ప్రేమలో తలకిందులైన వారిని తప్ప ఎవరినీ క్షమించడానికి వీలులేదు.

సరే. నువ్వు త్వరలో type పూర్తి చేస్తానంటే ఇంకేమి? కానీ.

నీ కథలు పంపే యత్నంలో ఉన్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం.



19/

[illegible]

నువ్వు వొస్తావని ఎదురు చూస్తో వుంటే, నీ వుత్తరం వొచ్చింది - వొస్తానంటూ కాదు, ఇప్పుడప్పుడే రానంటూ-

మొదటి సంగతి - 1956 ఏప్రిలులో నాకు మళ్లీ ఉత్తరం రాస్తావు కదా! అప్పుడు దాంట్లో బంధుత్వం పెట్టకు - బంధువులంటే ఎప్పుడూ నాకు పరమ అసహ్యం. ఇప్పుడు మరీని. చలంగాడికి - అని రాయి.

ఏడాదికైనా, ఈ శెలవల్లోనైనా, నా దగ్గరికి రానివారికి, నేనెందుకు జవాబు రాయాలో తెలీటంలేదు.

పుస్తకాలు చదవకు.

ప్రథమంలోనే నీతిబోధ ప్రారంభించాను.

చలం ప్రేమ లేఖలు మాని, నీతి లేఖలు రాసే గతికి దిగాడు.

ఏం చెయ్యను కాలాన్ని అంటావు. పనులు చెయ్యి, పాడుకు, తప్పు dare చెయ్యి, పాడు, తన్ను.

మనసు అగ్ని. దానికి తిండి వేసిన కొద్దీ, మంటలెత్తిస్తుంది. కాని దుష్కర్మ - అంటే ఇతరులని బాధించడం వల్ల మనకి చివరికి బాధనిచ్చే పనులకన్న చదవడం నయం.

కథలు రాయాలని రాయకు. నీ లోపల్నించి పెళ్లగించుకుని వొచ్చిందాన్ని ఎల్లా వొస్తే అట్లా రాయి. ఈశ్వరుడు చెప్పింది తప్పకుండా చెయ్యి - నీకు ఇష్టం కానీ, కష్టం కానీ.

మొత్తం మీద పని మనకి ఆత్మతృప్తినిస్తో వుండాలి.

కాని పనిలేకుండా కూచోడంకన్న ఏ పనైనా నయమే.

Dance Practice చెయ్యి. మంచి centerకి వెళ్లి నేర్చుకో. ముందు నేర్చుకో. తరవాత బోధిద్దుగాని. Danceని వొదలకు. సంగీతమూ, నాట్యమూ, రచనా, ఇవి ఇచ్చిన ఆత్మానందాన్ని ఏవీ ఇవ్వవు.

మేమా? మేమందరమూ అట్లాగే వున్నాము. నువ్వు వొచ్చి చూస్తే (రావన్నావుగా!) నిన్ననే వీళ్లని వొదిలిపెట్టి వెళ్లాను అనుకుంటాను. దాలీ, మా వంశ గౌరవాన్ని మరిచి, బదికి వెడుతోంది, ఇష్టపడి. అది ఈశ్వరుడు చేశారనుకో, నా తప్పేంలేదు. నాకు చాతనైనంత అడ్డుపడ్డాను. కాని ఈశ్వరాజ్ఞ. రంగమాలతి గారు వొచ్చారు నెలకిందట. ఆ మొక్క మీది కార్యక్రమం నాకు తెలీదు. పంతులు కుటుంబం ఎవరూ లేరిక్కడ. వొచ్చే సూచనలూ లేవు. రంగ ఇటు వొస్తాదట. వొస్తే ఇక్కడికి వొస్తాదో ఏమో!

నువ్వు చెప్పతలుచుకున్నవి వొచ్చి, వేడివేడిగా చెపితేనే కాని, చల్లబడిపోతాయి. నువ్వు చెప్పేవన్నీ వినడం నాకు చాలా ఇష్టం.

పోయినసారి నువ్వు నన్ను అడిగిన వాటికి, నీకు అర్థమయ్యేట్లు చెప్పగలిగానో లేదో! ఈ యేదు నాకింకా స్వప్నం జీవితం.

నువ్వు ప్రత్యేకమైన పిల్లవి. నిన్ను చూస్తే నాకు దిగులు వేస్తుంది. జీవితం నిన్ను ఏం చెయ్యబోతోందోనని. కాని నేనున్నానులే. నేనేమిటి? నన్ను రక్షించే ఈశ్వరుడూ వున్నారు. నీకు అవసరమైన రోజున. ఇక్కడి మాతో contact వొదులుకోకు.

నిన్ను గురించి రాసుకుంటేనేం! కాకపోతే, ఉత్తరంలో ఏం రాస్తావు? నీ వయసులో Vanity & self-importance అనేవి లేకపోతే, చచ్చురకంగా తయారౌతారు. కాని మనని మనం మరిచిపోవడం శ్రేయస్కరం. 'నేను' అనేది మనసులో నిలిచిన కొద్దీ, self centered అవుతారు క్రమంగా. గుంటలో నీళ్లు మురిగినట్లు. పనులలో, మనవికాని స్వార్థరహితమైన ప్రయత్నాలలో మనని మనం మరవాలి.





నీ విషయంలో, స్కూలు పెట్టడం, dance చెయ్యడం + నీకోసం dance కాదు. Dance కోసం నువ్వు అనేది లేకుండా నిన్ను అర్పించుకోవాలి.

మనుషులతో get on కావడం మంచిదే. కాని వాళ్లతో get on కావడం కోసం, మన స్వతంత్రాన్ని, మన convictionsని వొదులుకోడం compromise కావడం suicidal. వాళ్లమీది ప్రేమవల్ల వొదులుకో. (నిజమైన ప్రేమకన్న గొప్పది లేదు.) వాళ్లకి ఇదిసి కాదు. వాళ్లిచ్చే స్నేహానికీ, shallow affectionకీ, వాళ్ల worthకీ కాదు. వొంటరిగా నుంచోదానికి ఇదిసి కాదు. వాళ్లని ప్రేమించు. లొంగిపోకు.

సుఖ జీవితానికి hypocracy (sic) చాలా అవసరం. కాని సుఖ జీవనమా కావలిసింది? నీకు కూడానా? చావన గాని, సత్యం నించి తప్పు ...(అసంపూర్ణం)

# III

1959లో కృష్ణమోహనరావు గారితో నా పెళ్ళికీ, అంతకుముందు కొన్నేళ్ళ చలం అయన్ని గురించి తన వుత్తరాల్లో ప్రస్తావించారు. ఒకవిధంగా మావారు, చలానికి ఎన్నో విషయాల్లో అమడల దూరం. విభేదమైన స్వభావం, విభిన్నమైన సంస్కృతి, జీవనసరళి. కృష్ణమోహనరావు గారు చాలా సంప్రదాయమైన మనిషి. ఆడవాళ్ళు, మగవాళ్ళు, భార్యాభర్తలు, మగవారి అధిక్యత, ఆడవారి అసమర్థత వంటి విషయాలపైన ఖచ్చితమైన అభిప్రాయాలున్న వ్యక్తి. నావల్ల ఆయన ప్రేమగానీ అంతగా నన్ను సముద్రం ఉప్పెనలాగ ముంచెత్తి 'కబళించి' వుండకపోతే, చలం నా జీవితంలో ఆక్రమించిన పాత్రకు మరింత బలం వుండేది. మరికొంచెం దీర్ఘమైన, గాఢమైన సంబంధం చలంతో కొనసాగి వుండేది. నాచేత ప్రేమింపచేసుకుని మరీ పెళ్ళి చేసుకున్నారు కనుక కృష్ణమోహనరావు గారిని చలం సహించారు.

మావారు, చలానికి ఎన్నో విషయాల్లో అమడల దూరం. విభేదమైన స్వభావం, విభిన్నమైన సంస్కృతి, జీవనసరళి.

లేకపోతే, తూ.గో. జిల్లా కోనసీమ ఆరువేల నియోగి బ్రాహ్మణ యువకుడిగానే ముద్రవేసుకుని, చలం పరిధిలోకి వెళ్ళే ప్రసక్తే వుండేది కాదు.

స్త్రీలు భర్తని గౌరవించడం, పసుపు, కుంకం ధరించి, పూజలు చేయడం, 'మీరు' అని మన్నించాలని, పాదాలకు సందర్భం వచ్చినప్పుడు దణ్ణం పెట్టాలని, మగవారి సమక్షంలో ఆడువారు అణకువగా, ఒదిగి వుండాలని, ఎంతో నమ్మిన వ్యక్తి నా భర్త. నేను అవిధంగానే లొంగిపోయేదాన్ని. 16 ఏళ్ళ మా కాపురంలో, వారి సంప్రదాయానికి, చలం రక్తం నాలో వున్నందువల్లనూ, మా తాతగారు



దుల్ల పట్టాభిరామయ్య గారు కూడా అధునిక దృక్పథం మనిషి కావడం వల్లనూ నాలో తొంగిచూస్తుండే తిరుగుబాటుతనానికీ, కొంత ఘర్షణ వచ్చేది. కానీ సతీధర్మం నిర్వర్తించాలని అనుకునేదాన్నో ఏమోగానీ, అంతర్గతంగా ఒక క్రమశిక్షణతో అత్తవారు మెచ్చే ఆదర్శ గృహిణిగానే బతికాను.

ఇటువంటి నా ప్రేమను, పెళ్ళిని, దాంపత్యాన్ని గురించి, నా తల్లిదండ్రులు కృ.మో.రా. గారిని నల్లగా వున్నారని, డబ్బు లేదనీ, లావుగా వున్నారనీ ఆమోదించకపోవడం గురించి, ఎంతో ఆలోచించి ఆ సంగతులు వ్రాసేవారు. నాకు పిల్లలు కలగడం లేదని చిన్న కలవరంతో నాకు హెచ్చరిక చేసిన శ్రేయోభిలాషి. ఈ విషయాలు ఎన్నో వుత్తరాల్లో వ్యక్తమైనాయి.

నన్నూ నాలో కృష్ణమోహనరావుగారంటే కలిగిన ప్రేమనీ, ఆయన అర్థం చేసికొని చాలా ప్రోత్సహించారు. "నీకు సంగీతం, డ్యాన్సు వచ్చు. తెలివి, పరీక్షలు పాసయ్యే నేర్పు, ప్రజ్ఞ వున్నాయి. రూపం వుంది. ధనం కూడా వుండేమో!... పైగా నీలో ఒక ఆత్మ వుంది. అదే నన్ను ఆకర్షించింది. ఇయ్యడానికి హృదయం వుండవచ్చు. కానీ ఆ హృదయం నిన్ను ముంచెయ్యని హృదయం. హృదయాన్ని భద్రపరచుకొనే జాగ్రత్తని నేర్చుకొంటున్నావు. కనుక ప్రాపంచికంగా వృద్ధిలోకి వస్తావు. అటువంటి వాళ్ళకి నేనీనాడు రాసే మాటలు నచ్చవు... కనుక నన్ను నా గతికి 'వొదిలెయ్యి'" అన్నారొకసారి.

మా పెళ్ళయిన తర్వాత మేమిద్దరం వెళ్ళాం.

"ఆయన నాకు బావున్నారే! అంతకన్నా అనడానికి ఆయన్ని నేనే మెరుగుదును? ఏమైనా మనిద్దరం ఏళ్ళ కింద ఏరుకొన్న మొగుడే కదా!" అన్నారు.

మరోసారి మేమిద్దరం వెళ్ళినప్పుడు ఆటోలోంచి నేను దిగగానే, వరండాలోకి వచ్చి పకపక "ఒకరా, యిద్దరా, ముగ్గురా?" అని కేక వేసింది. అప్పుడు చలం నాతో అన్నారు. "ఇప్పుడు సరే, నలభై ఏళ్ళ తర్వాత నువ్వు బతికి వుండదలచుకుంటే, అసలు పిల్లలు లేకుండా అయిపోకు. దేంతోనూ తీరని బాధకి subject అవుతావు."

"... నీలో ఒక ఆత్మ వుంది. అదే నన్ను ఆకర్షించింది. ఇయ్యడానికి హృదయం వుండ వచ్చు. కానీ అది నిన్ను ముంచెయ్యని హృదయం."

"నీ సంగతులు ఏం మాట్లాడినా నాకేం 'విసుగు'లేదు. రష్యా అమెరికా పైన H.Bomb వేసిందని అంటే 'అట్లాగా' అంటాను. కానీ బేబీ, కడుపుతోందని తెలిస్తే- పాపం చిన్న baby అంత పెద్దపొట్టని ఎలా మొయ్యగలుగుతుంది? అని వ్యాకుల పడతాను. నీతో మిత్రుడున్నాడు యిక్కడ. నీ చెయ్యి ఇటు చాచి ఉన్నంత

కాలం చేతిని విడవని మిత్రుడు... నా వేపు ఆశతో చూసే జేబీ. నా వేపు చెయ్యి చాచే బీద అమ్మాయి. తెల్లారే నా మొహంలోని నవ్వే బంతిపువ్వు – అంతకన్నా దూరంగా, పూర్వద్వేషంతో నన్ను తిట్టే అప్తులు. వీరందరి కళ్ళల్లో ఈశ్వరుణ్ణి చూడగలగాలనే యత్నమే –"

మేము 1971లో మా పెద్దమ్మాయిని తీసికొని వెళ్ళాము. ఫోటోలు తీసుకొన్నాము. అప్పటికి ఆయన చాలా తక్కువగా మాట్లాడుతున్నారు. చిరునవ్వుతో, మాసిన గడ్డంతో, రంగు చొక్కాలు, లుంగీతో, కొంచెం బలహీనంగా కనబడ్డారు. మర్యాద మాటలు, అనవసరమైన మెచ్చుకోళ్ళు ఆయనకి ఎప్పుడూ అలవాటు లేదు. సుమారు 78 ఏళ్ళ వయస్సులో అసలు చేతకావు.

1974లో నా భర్త రోడ్డు ప్రమాదంలో చనిపోయి, నా లోకం తలక్రిందులై, ఇద్దరు చిన్నపిల్లలతో నేను అనాథగా మిగిలిపోయినప్పుడు చలం నన్ను పలుకరించలేదు. ఆయనకి తెలిసిందో లేదో అని కూడా నాకు తోచే స్థితిలో లేను. అతిభయంకర విషాదంలో పడి, బతకడం కంటే చావడమే నయం అనే విపరీత మనస్థితిలో పడినప్పుడు చలం నా మనసుల్లో లేదు. కానీ ఆయనకు నాకు వచ్చిన పెద్ద కష్టం గురించి తెలుసునని, కొన్నేళ్ళ తర్వాత చీమ్మలో కలిసినప్పుడు నర్తకి, సౌరిస్ చెప్పారు.

ఆయన ఆ తర్వాత ఐదేళ్ళే బతికారు. 'నేనిల్లా దుఃఖంలో కొట్టుకుపోతున్నానని' ఆయనకు వ్రాస్తే, ఏమి జవాబిచ్చేవారో! కానీ నేను ఆయనకు యీ సమాచారం యిచ్చి, ఓదార్పు పొందాలనుకోవడం, ఆయన ఆనాటి ఆధ్యాత్మిక, అనారోగ్య, అశక్త స్థితిలో అనవసరం. అందుకే 'చలం' పరిచయం ఒక సుదూర స్వప్నకథగానే మిగిలిపోయింది.



# IV

మొట్టమొదటి నా జ్ఞాపకం 1947 ప్రాంతంలో ఆయన మా అమ్మమ్మగారింటికి, తన తల్లి కొమ్మూరి వెంకట సుబ్బమ్మ గారిని చూడ్డానికి బందరు రావడం. పొట్టిగా, విపరీతమైన పసిమిరంగులో, తడి మెరుస్తున్న పెద్దకోల కళ్ళతో, సరిగ్గా మా అమ్మమ్మగారినే పోలిన కోమల సౌందర్య రూపం. సన్నని కంఠంతో ఆయన మాట. నాకు పదేళ్ళు. నన్నెవరు పట్టించుకుంటారు?

ఆ తర్వాత జ్ఞాపకం-విజయవాడలో లక్ష్మిటాకీసు దగ్గర మేడమీద ఆయన పచార్లు చేస్తోంటే కింద నుంచి మా అమ్మమ్మ చూపించారు. 'అదుగో మా అన్నయ్య' అని. నేను ఆకాశవాణి డ్రామా ఆడిషన్‌కి వెళ్ళి, నెగ్గిన సందర్భం అది - 1951 అనుకుంటాను. తెల్ల నిక్కరు వేసుకొని, ఆయన తిరుగుతున్నారు. వారింట్లోకి నన్ను తీసుకెళ్ళలేదు. నేను అప్పటికి ఆయన పుస్తకాలు చాలావరకు చదివాను.

మేడమీద ఆయన పచార్లు చేస్తోంటే కింద నుంచి మా అమ్మమ్మ చూపించారు. 'అదుగో మా అన్నయ్య' అని.

చిన్నప్పటినుంచి మా యింట్లో అమ్మమ్మ, తాతయ్య గారు అంటూ వుండిన మాటలు నాలో ఒక అభిప్రాయాన్ని కలిగించాయి. 'పెద్దమామయ్య' ఒక చపలమైన వ్యక్తి. ఆయన లీలల వల్ల ఆయనను కన్నవారు, కట్టుకున్నవారు, ఆయన కన్నవారు కూడా కష్టాల పాలైనారు. ఆయన స్నేహాల వల్ల ఎన్నో కుటుంబాలు చెదిరిపోయినాయి. ఆయన విపరీత ప్రవర్తన, విచిత్ర చర్యల వల్ల సంఘంలో ఎబ్బెట్టుగా తోచేవారు.

ఇటువంటి ఆలోచనలు వారందరిలో వుండేవి. నేనూ వినేదాన్ని. నాకు

17 ఏళ్ల వయస్సు వున్నప్పుడు మదరాసులో డ్యాన్సు నేర్చుకోవడానికి ప్రతి వేసవికి, అంటే 1954 వరకు, వరుసగా మూడేళ్లు వెళ్లి రెండేసి నెలలు కనీసం వుండేదాన్ని. చలం చివరి చెల్లెలు, మా చిన్నమ్మమ్మ కొమ్మాజోశ్యుల రాజరాజేశ్వరి గారింట్లో, మాంబళంలో. అక్కడి నుంచి రోజూ బస్సులో ఉదయం, సాయంత్రం ఎగ్మూరులోని ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌కి, భరతనాట్యం నేర్చుకోవడానికి వెళ్లేదాన్ని. గొప్ప గురువు స్వర్గీయ పందనల్లూరు చొక్కలింగం పిళ్లై గారి దగ్గర. నాకు 8-10 మధ్య వయస్సులో ఆయన బాగా నేర్పించారు. అది నేను మరిచిపోక, మధ్యలో బందరులో వెంపటి చినసత్యం గారి దగ్గర ఎంతో నేర్చుకున్నందువల్ల తిరిగి భరతనాట్యంపైన మక్కువతో స్పెషలు క్లాసులకి వెళ్లేదాన్ని.

అన్నయ్య భక్తిలోపడి, తరించిపోతున్నాడని, తమకీ కాస్త ఆధ్యాత్మికత అంటుకుంటుందని ఆయన చెల్లెళ్లు కాదంబరి జానకీబాయి కుటుంబం, 'పాప' (రాజేశ్వరి) గారి కుటుంబం తమ ఐదారుగురేసి సంతానంతో కలిసి మదరాసు నుంచి తిరువణ్ణామలై వెళ్లేవారు. అందువల్ల మదరాసుకీ అరుణాచలేశ్వరుని పట్నానికి మధ్య రాకపోకలుండేవి. కొమ్మూరి పద్మావతి గారి కుటుంబమూ వెళ్లేది, మరొక తమ్ముడు కొమ్మూరి గోపాలరావు గారి కుటుంబం అంతగా వెళ్లినట్టు నాకు తెలియదు.

పెద్దమామయ్య గొప్ప రచయిత, చూడాలి అని కోరిక. ఎగ్మూరు స్టేషన్‌లో రైలెక్కి, విల్లుపురంలో రాత్రి రైలు మారి తిరువణ్ణామలై చేరుకొనేదాన్ని. ప్యాసెంజర్ రైళ్లలో లైట్లు కూడా లేని రోజుల్లో పదహారు ఏళ్ళ పిల్లని ఎలా వెళ్ళేదాన్నో మా వాళ్ళు ఎలా వెళ్ళనిచ్చే వారోనని యిప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. చలం నాకు చాలా ప్రేమతో స్వాగతం పలికారు. రమణాశ్రమం దగ్గరలో వున్న 'బోస్ బంగళా' చిన్న యిళ్ళల్లో ఆయన భార్య రంగ నాయకమ్మగారు, పిల్లలు సౌరిస్, పకపక, యితర పిల్లలు నర్తకి, చిత్ర, వాళ్ళమ్మాయి దాలీ - యిద్దరు చెల్లెళ్ళు, కాదంబరి జానకీబాయి, రాజేశ్వరి, వాళ్ళ పిల్లలు ఆరుగురేసి - తన శిష్యుడు బసవరాజుగారు - యింతమందితో వున్నారు ఆ వేసవిలో. ఆయన పప్పు రుబ్బేవారు, తోట పనిచేసేవారు. సాయంత్రం భజన పాటలు. మంచి సాంబారు, కూరతో అన్నం. నేను చారు చేయడం నేర్పించాను. తరువాత నాకు వ్రాశారు. "ఇప్పుడు చారు చేసుకుందాం అని, బేబీ చారు చేసుకుందాం అంటాం. ఇవాళ కూడా బేబీ చారే."

"ఇప్పుడు చారు చేసుకుందాం అని. బేబీ చారు చేసుకుందాం అంటాం. ఇవాళ కూడా బేబీ చారే."



ఆ వాతావరణంలో, ఒక కుతూహలంతో, రొమాంటిక్ దృక్పథంతో నేనూ వెళ్లాను. వెళ్లాక ఎంతో చనువు పెంచుకున్నాను. నేనంటే అక్కడి వారందరికీ ప్రత్యేకమైన అభిమానం. మిగిలిన వారివలె కాక నాకు కాస్త సాహిత్యం వాసన వున్నట్లు పోజు. నా ఆట, పాట, చలాకీగా వంటగదిలో దూరిపోవడం చలం యింట్లోవారికి, వచ్చిపోయే వాళ్లకు కూడా ఆకర్షణీయంగా కనబడేవనుకుంటాను. ఆ కారణాలుగా నేను రాత్రి భజనలలో, బ్రహ్మసమాజం గీతాలు ఆలపించడంలో పాల్గొనేదాన్ని. అవకాశం దొరికినప్పుడల్లా చలంతో కూచుని ఏవేవో మాట్లాడేదాన్ని.

'నువ్వు శృంగార రచనలు చేశావు. స్త్రీ పురుష సంబంధాలను గురించి విప్లవాత్మకంగా, ఎంతో పచ్చిగా రాశావు. మరి యిప్పుడు యీ యోగి పాత్ర ఏమిటి?' అని చాలాసార్లు అనేదాన్ని. నా వయస్సు పొగరు అది. ధైర్యంగా ఎవరితో పడితే వారితో, తోచినవి అనేయడం అలవాటున్న రోజులు

"నా రొమాన్సు అనేది నా రక్తంలో కలిసి నాలోనే పుట్టింది. ఎంత ప్రయత్నించినా శృంగార వాంఛను యీ నాటికీ జయించలేకపోయినాను. అదే లేకపోతే నేనెందుకు బ్రతికే?... స్త్రీతో కొన్నేళ్లు స్నేహమైతే, నాలోని శృంగార భావం పాతబడి, ఇంక నన్ను ఆకర్షించడం మానేసేది. అప్పుడు యింకొక కొత్త శృంగారం సంబంధం కోసం కొట్టుకునేవాణ్ణి. ఇది గొప్ప ప్రేమ కాదు. ఉత్త కామమూ కాదు. పసితనం నుంచి, నాకు అన్నేళ్లుగా ఆ వాంఛలు వుంటూనే వుండేవి. ఎంతో విరహపడేవాడిని - కలలు కనేవాడిని.

లోపరహితమైన ఈ భూమి limitations మించి - సంచరించే ఓ స్త్రీ నాలో వెలుగుతూ వుండేది. ఆమె స్వప్నచారిణి ... కానీ యీ శృంగారమంతా కామంతో నిండివుండడం వల్ల పాపం అనిపించేది. ఇది పాపమా? ఇంత ఆనందకరమైనది పాపమా? భార్యతో లేని పాపం, ఇంకో స్త్రీతో పాపం ఎట్లా అయింది? ఈ శృంగారం పాపమని నిజంగా ఈశ్వరుడు చెప్పాడా?" అంటూ ఆయన ఎంతో విస్తృతంగా, అనేక వందల పేజీల్లో విస్తరించిన భావాలతో, ఆకర్షణతో ఆకట్టుకునే భాషలో వ్రాశారు కదా!

'నువ్వు శృంగార రచనలు చేశావు. స్త్రీ, పురుష సంబంధాలపై విప్లవాత్మకంగా రాశావు. మరి యిప్పుడు యీ యోగి పాత్ర ఏమిటి?'

మరి అవన్నీ ఏమైపోయినాయి అని నేను చాలాసార్లు అడిగేదాన్ని. ఆయన వ్రాసినవన్నీ నాకు అర్థమై కాదు. పరిణతిలేని పెంకెతనం ప్రశ్నలు.

చలం వాటిని సీరియస్‌గా తీసికొని నాకు జవాబులివ్వడం ఎంతో

ఆశ్చర్యకరం. మా బంధుత్వం వల్ల కొంత, నేనేదో చదువులు, లలిత కళలు బ్రహ్మాండంగా వెలిగిస్తున్నానని బంధువర్గంలో పేరు వుండడం వల్ల ఆయన నన్నొక మనిషిగా లెక్కవేసి, నాకు జవాబులిచ్చారు. అది కొంత ఆయన గొప్ప ప్రేమతత్వంలో ఒక భాగం. వారేమిటి, వీరేమిటి, కొంచెం ప్రత్యేకంగా పలుకరించిన ప్రతివారితోనూ అలాగే వుండి వుండవచ్చును.

నేను కూడా పాటలు పాడి, డ్యాన్సులు చేస్తూ, అందరితో వుంటూనే, చలం దగ్గర ప్రత్యేకంగా, ఏకాంతంగా కూర్చుని మాట్లాడేదాన్ని. "నువ్వు చాలా ప్రత్యేకమైన పిల్లవి. నిన్ను చూస్తే మదర్లీ ఫీలింగ్ వస్తుంది. ఏమైపోతుంది యీ పిల్ల యీ యిరుకు లోకంలో అని. నీ జాగ్రత్త నువ్వు చూసుకునే గట్టితనం నీలో వుందని తెలిసి కూడా" అని వ్రాశారు. ఆ తర్వాత 'because you are different from the crowd...' డబ్బు, ప్రతిష్ఠల 'విలువల' నుంచి మించిన దానిని కనుకనే నన్ను నువ్వు విడవలేవు. నేను నిన్ను విడవలేను. Don't lose your soul - అంటూ వుంటాను. ఎందుకు? నీమీద ప్రేమ గనుక! అంతే కాదు, నేను నీకు gratefulగా feel అవుతాను. నువ్వు యిక్కడికి రావడం, నాతో అంత యిష్టంగా వుండడం అదొక fairy dreamగా చూసుకుంటాను. నువ్వు నాకు కొత్త confidenceని, తృప్తిని, గర్వాన్ని యిచ్చావు."

అదీ నాపై కలిగిన భావం. కొన్నేళ్ళ పాటు ఆ ప్రత్యేకమైన అనుబంధం ఉత్తరాల ద్వారా, నేను అప్పుడప్పుడు వెళ్ళి రావడం ద్వారా నిలిచింది. అది ఎంత అపురూపమైనదో, చలం అభిమానులకూ, పరిశోధకులకూ ఎంత విలువైనదో, నాకు యీ మధ్య వరకు తెలియదు. నాళేశ్వరం శంకరంగారు వచ్చి అడిగే వరకు ఆ ఉత్తరాలు ఎలా వున్నాయో నేను పట్టించుకోలేదు. కొన్ని పొడిగా రాలిపోయినా యింకా మిగిలినవి తీసి, వాటిల్లో ఆయన అంతరంగాన్ని తెలిపే భాగాలు అక్కడక్కడా నేను ప్రసంగించినప్పుడు నలుగురికీ వినిపించాను.

"నీ పుస్తకాల వల్ల ఎందరో పాడైపోయారు అంటారు" ఎందుకట్లా రాశావు? అని అడిగాను.

నేను తిరువణ్ణామలై చేరుకొన్న రాత్రి వెన్నెల్లో చెట్లకింద ఆయన పడుకున్నప్పుడు పక్కన కూర్చున్నాను. నాకు భయం లేదు. సంకోచం లేదు. "నీ పుస్తకాల వల్ల ఎందరో పాడైపోయారు అంటారు" ఎందుకట్లా రాశావు? అని అడిగాను. "అట్లా అనిపించింది, రాశాను" అన్నారాయన. "మరిప్పుడు యిల్లా ఈశ్వరుడు అంటూ భజన చేస్తున్నావేం?" అన్నాను. "ఇప్పుడిట్లా అనిపిస్తోంది" అన్నారు. ఇంకా ఏం మాట్లాడానో గుర్తులేదు. అప్పుడాయన



నన్ను దగ్గరకు తీసుకొన్నారు. ఒక స్త్రీని పురుషుని వలె ముద్దు పెట్టుకున్నారు. అప్పుడు నేను ఆయనకు మనుమరాలిని కాదు, అందమైన ఆడపిల్లని - అని యిప్పుడు అనిపిస్తోంది.

మరోసారి వెళ్ళినప్పుడు కొన్ని పాటలు నేర్పాను. టాగోర్ గీతాలు తెలుగులో మల్లవరపు విశ్వేశ్వరరావుగారు అనువదించగా రేడియోలో ప్రసారమైనవి. "ఆ పాటలే పాడుకుంటున్నాం. కొత్తవి ఎప్పుడు నేర్పిస్తావు?" అని ఉత్తరాల్లో నిష్ఠూరంగా వ్రాసేవారాయన.

నేను ఎందుకు ప్రత్యేకంగా కనబడ్డానంటే, నేనూ చలనే కనుక. ప్రకృతి, ప్రేమ, రొమాన్సు వంటి అంశాల పట్ల నాలో ఒక మొగ్గ వున్నట్లు ఆయనే కాదు, మా బంధువులందరూ పసిగట్టారు.

నేను విపరీతంగా చదివిన నవలలు, కథలు, కవిత్వం వల్ల 12 ఏళ్ళ వయస్సు నుంచి నాలో ఒక చాపల్యం వుండేది. ఆ మనుష్యులు గతించారు. ముఖ్యంగా మదరాసులోని మా బంధువు, నాకంటే పద్నాలుగేళ్ళు పెద్దవాడు కొమ్మూరి సాంబశివరావుతో నేను షికార్లు తిరిగేదాన్ని. ఐతే నా లోలోపల ఒక క్రమశిక్షణ లేదా భయం వుండి 'రొమాన్సు' వరకే గానీ శృంగారం వరకూ పోయేది కాదు. కానీ అది చాలు, అర్ధరాత్రి వరకు బీచ్‌లో 'కేవీ' తిరిగింది ఉష్తితో కలిసి అని - బంధువుల మధ్య ప్రోత్సహించడానికి. నాలో మెల్కొన్న విస్మయకరమైన భావాలన్నీ అతనికి ఉత్తరాలు వ్రాసేదాన్ని. ఇవన్నీ మావాళ్ళు తుంచివేసి నన్ను కట్టడి చేయడం వల్ల నా బతుకు పెడదారి పట్టలేదనుకోవాలి.

ఈ వార్తలు చలానికి చేరాయి. దాంతో నాలో ఆసక్తి పెరిగింది ఆయనకి. అప్పటికే, యింకా ఎంతోముందునుంచే కృష్ణమోహనరావు గారికి నామీద పిచ్చి ప్రేమ. ఈ సాంబశివరావు ఉదంతం నేను చెప్పాను. ఐనా ఆయన నన్ను వదలలేదు. ఈ ప్రేమ, పెళ్ళికి దారితీయడం, మా యింట్లో వారితో నా ఘర్షణ - యివన్నీ చలానికి ప్రీతికరమైన విషయాలు. అందుకే నన్ను ప్రోత్సహిస్తూ, నాలోని మనస్సునో, ఆత్మనో ఒక సజీవంగా స్పందించే స్థితిలో వుంచుతూ, నాకు ఉత్తరాలు రాశారాయన.

నన్ను ప్రోత్సహిస్తూ, నాలోని మనస్సునో, ఆత్మనో ఒక సజీవంగా స్పందించే స్థితిలో వుంచుతూ, ఉత్తరాలు రాశారాయన.

ఆయన నిజాయితీ ముందు నా కృత్రిమత్వం భయంకరం... నేను ఆయనకు వ్రాసినవన్నీ నిజాలో కాదో తెలియదు కానీ, ఆరోజుల్లో ఆయన నాకొక పూతకర్రగా ఉపయోగపడ్డారు.

చలం చక్కని పాటగాడు. బ్రహ్మానమాజం పాటలు 'జయము

జ్ఞానప్రభాకరా, జయము శాంతి సుధాకరా, జయము మోహతమోహరా, జయ జయ కరుణాకరా' – 'కోటికంఠముల కూర్చి పాడుదము సాటిలేని మన ప్రభుగూర్చి' – వంటివి శ్రీమహేశ, అరుణాచల శివ, శ్రీరాం జయరాం – వంటి భజనలు కంఠం ఎత్తి పాడేవారు. హార్మోనియం వాయించేవారు. ఎంకిపాటలు, ముఖారి, నాదనామక్రియ వంటి రాగాల్లో ఎంతో భావంతో పాడేవారు. 'ఎంకి వంటి పిల్లలేదోయి. లేదోయి' – 'దూరాన నారాజు' – 'ఎంకీ నాతోటి రాయే' వంటివి ఆయన పాడుతోంటే పద్యాలాల ఎంకి, ఆమె కోసం కళ్ళల్లో దీపాలుంచుకుని ప్రేమించిన ఆ నండూరి మనముందర సాక్షాత్కరిస్తారు. చలం కంఠంలో నాదం అది, ఆయన స్వరశుద్ధిలోని రాగానుభవం అది. మేమంతా పాడేవాళ్ళం. కాదంబరి నిర్మల మీరా భజన్‌లు ఎన్నో పాడేది. అందరూ నేర్చుకొనేవాళ్ళం. సాయంత్రం ఏడు నుంచి సాగిన ఆ గాన కార్యక్రమం ఎంతో శాంతిని నింపేది. అర్థంగా గుండెను బరువుగానూ చేసేది. మా అమ్మమ్మ దగ్గర నేర్చుకొన్నాను యీ పాటల్లో చాలవరకు. సందర్భం వస్తే ఎప్పుడైనా పాడేస్తూ వుండడం నాకు సరదా కూడా.

నేను అప్పటికి చాలా కథలు వ్రాశాను. కుటుంబరావుగారు, దేవులపల్లి, గోరాశాస్త్రి మొదలైన వాళ్ళు, రమణ, బాపు వంటి నాతరం మనుష్యులు మెచ్చుకోవడం జరిగేది. నాకు భయం చలానికి నా కథ చూపించాలంటే. ధైర్యం చేసి 'ఎర్రగులాబీలు' అని ఒక కథ – తెలుగు స్వతంత్రలో గోరాశాస్త్రి ప్రచురించి, అభినందిస్తూ నాకు ఉత్తరం వ్రాసిన మేలైన కథ అని నేను అనుకున్నది – యిచ్చాను. "సత్తికి చెప్పింది, పొట్టిపిచ్చికకి మళ్లె నువ్వొక కథ వొదిలి వెళ్ళావని" అంటూ "మామూలు దృష్టితో చూస్తే నువ్వు రాసిన కథ బాగానే వుంది, కానీ చలానికి పూర్తిగా తృప్తిగా లేదు. సగం వరకు చాలా బావుంది. ముగింపు ఎంతో బాగుంది – Final verdict ఏమిటంటే, The writer is capable of writing very entertaining stories - A skilful hand'.

"మామూలు దృష్టితో చూస్తే నువ్వు రాసిన కథ బాగానే వుంది, నీ చలానికి పూర్తిగా తృప్తిగా లేదు. ముగింపు ఎంతో బాగుంది"

"నీ కథ చదివాను. ఏం బాలేదు. నేను మెచ్చుకోవాలని ఎందుకు గోలపడతావు – నీ కథలలో లోపం లేదు – వాటిని చదవలేకపోవడం చలం tasteదే లోపం" అన్నారు మరోసారి. "కథలు రాయాలని రాయకు. నీ లోపల్నుంచి పెళ్ళగించుకొని



'వచ్చి' ఎట్లా 'వస్తే' అట్లా రాయి" అన్నారు. అందుకేనేమో నేనీమధ్య ఏమీ రాయలేకుండా వున్నాను!

1961-62 సంవత్సరాల్లో నేను చలం కోసం ఇంగ్లీష్ టైపింగ్ నేర్చుకొన్నాను. ఆయన పుస్తకం 'Sacred Heart' type చేయడానికి. Orient Longman వారనుకొంటాను, రాత ప్రతి తీసుకోరు. టైపు చేయాలి. నా దగ్గర అంత డబ్బు లేదు అన్నారాయన. నేను సుమారు 217 పేజీలు టైపు చేసి పంపించాను.

"నువ్వు శ్రమ పడ్డమే కాదు, ఎంతో శ్రద్ధతో చూసినట్లు కనపడుతోంది. ప్రతి పేజీలో నీ ప్రేమ వుంది" అన్నప్పుడు చాలా సంతోషపడ్డాను. ఆయన నాకిచ్చిన స్నేహానికి, కొంతైనా ఋణం తీర్చుకున్నానని అనుకున్నాను.

19/21.

వొవ్వర్ రాస్తున్నాడు -

'జానకీరాణి - ఆమె కథలు ఎన్నో చదివాను. ఆమె 'దైనందినం' కథతో కొన్నాళ్లు నా సొంత కలలూహల్లో కూడా గడిపాను'

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

ఆ ఉత్తరంలోనే నాకు కూడా ఓ compliment విసిరాడు - మొన్ననే 'కొత్తదిగుళ్లు' చదివా. 'ఏం రాశావురా చలం' అనుకున్నాను.

అంతేకాదు

ప్రవీణ్ తు. కృ.మోహనరావుగా కూడా తెలుసు అన్నాడు.



28/10.

రాణికి,

నీ ఉత్తరం. ఈ మధ్య ప్రియమైన రాణికి అని ఓ ఉత్తరం ప్రారంభించాను. ఆ ఉత్తరం ఏమయిందో! కనక రాణికి అని రాస్తున్నాను.

అయ్యో, ఉత్తరం ఆలస్యమౌతోందే. రాణి ఎదురు చూస్తోందేమోనని అనుకున్నాను. కాని వెంటనే, "ఏం? నా ఉత్తరాలకి తాను ఆర్నెల్లకి జవాబు రాస్తుంది కదా! ఈ కాస్త ఆలిస్యమైతేనేం? అనుకున్నాను.

ఇంతకీ కారణం- వొళ్ళు బాగాలేదు. పని మాత్రం ఎక్కువయింది. కాకా (చిత్ర రెండో కూతురు) నన్ను రాయనీయదు. తను రాస్తాననంటుంది. ఇంకా వొళ్ళు ఎప్పటికి బాగౌతుందో, ఏదో వొకటి రాద్దామనుకున్నాను. కానీ నిద్ర పోతోంది.

మామూలు దృష్టితో చూస్తే నువ్వు రాసిన కథ బాగానే వుంది. కాని

చలానికి పూర్తిగా తృప్తిగా లేదు. సగం వరకు చాలా బావుంది.

1) అతను కనపడగానే ఆమె ఎందుకు అడగలేదు. తన సందేహాన్ని ఎందుకు తీర్చుకోలేదు.

2) ఆ స్థితిలో ఆ అబ్బాయి ఉత్తరం రాయనే రాయడు.

3) రాసినా, ఆ ఉత్తరం artificialగా writer అల్లిందాని మల్లే వుంది.

ముగింపు ఎంతో బావుంది.

Final verdict - ఏమిటంటే - The writer is capable of writing very entertaining stories. A skillful hand.

ఇవాళ పొద్దున్న అనుకున్నాను. నా secretaryని నీకు రాయమందామనుకున్నాను. "నాన్నకి వొళ్లు బాగాలేదు. నెమ్మదిగా రాస్తాడని!"

సరే, మీ కుటుంబం నీ చుట్టూ ఎందుకు చేరుకుంటోంది? వీరి తరవాత తాతలూ, అమ్మమ్మలూ పిన్నమ్మలూ, మామలూ దిగుతారా? నీ పెళ్లి ఆపడానికి కాదు కదా!

జాగ్రతః, తస్మాత్ జగ్రతః

అర్థం కావడం కన్న ఇష్టపడడం చాలా గొప్ప. ఆ ఇష్టాన్ని అట్లాగే వుంచుకో - అంతే చాలు.

Because you are different from the crowd - డబ్బు ప్రతిష్ఠ విలువలనించి మించిన దానివి కనకనే - నన్ను నువ్వు విడవలేవు, నేను నిన్ను విడవలేను. అప్పుడు ఇక్కడవున్న 'కాదంబరి crowd'కి నేనిష్టమైనానా? వాళ్లు నాకిష్టమైనారా?

ఎందుకు నిన్ను పదే పదే warn చేస్తాను నేను? నువ్వూ నేనూ ఎప్పటికీ కలుసుకోకపోయినా, Don't lose your soul' అంటూ వుంటాను. ఎందుకూ నీమీద ప్రేమగనక.

అంతేకాదు. నేను నీకు gratefulగా feel అవుతాను. నువ్విక్కడికి రావడం, నాతో అంత చనువుగా వుండడం - అదొక fairy dreamగా చూసుకుంటాను. నువ్వు నాకో కొత్త confidence నీ, తృప్తినీ, గర్వాన్నీ ఇచ్చావు.

ఆ సుబ్బయ్య గారికి జవాబు రాయి. ఆయనే నా చరిత్రకారుడు. నువ్వు రాసింది తన పుస్తకంలో వేసుకుంటాడు. నిన్ను చూసుకుని నేను గర్వపడేట్టు రాయి. అబద్ధాలు రాయమని కాదు.



"నిన్ను scandalise చేస్తున్నారా?" అని రాశావు. ఆ మాట నిజంగానే అనుకుని రాశావనుకుని, వెంటనే నీకు కష్టపడుతూ ఉత్తరం రాశాను. ఈశ్వరుడు చెప్పారు? నువ్వు seriousగా mean చెయ్యలేదని. చించేశాను ఉత్తరం.

నీవేపువాళ్లే. నీవాళ్లే. నేను scandalise చేస్తానా?

నిన్ను గురించి ఏం చెప్పలేదు-

'L' అమ్మాయి - "నీ జీవితంలో ఏముంది చరిత్ర రాయడానికి? తిట్లు తినడం, తిట్టడమేగా!" అని రాసింది అనిరాస్తే. ఆయన నీ address ఇమ్మన్నారు ఇచ్చాను" అంతే.

హైద్రాబాదు నించి నిర్మల నర్తకికి రాసింది అమ్మమ్మకి జబ్బుగా వుందని.

One fine morning న నువ్వు అతని ఇంటికి వెళ్లిన రోజున నాకు టెలిగ్రాం ఇయ్యి. ఈశ్వరుడి permissionతో నేను చాక్షీవం చేసుకుంటాను. నువ్వక్కనే నిలిచిపోతే.

I will be next proud of you.

ఆ పని తొరగా చెయ్యి. నీ బంధు బృందాన్ని తలుచుకుంటేనే భయంగా వుంది నాకు. మీకు పెళ్లి అయిందనే scandolous rumourని అట్లా ప్రచారం కానీకు. నువ్వు స్వశక్తి కలదానివైనావు గనకనూ, ఒక అతను నిన్ను తీసుకోడానికి సిద్ధంగా వున్నాడు గనకనూ ఆగారు మీవాళ్లు. అట్లా కాకపోతే, చిన్నప్పుడు నిశ్చయం చేశారో, ఆ stepsనే తీసుకునేవారు. They are biding their time to strike, or they hope something may happen to their favour.

'You will be surprised' కాదు, you will be overjoyed - అని రాయవలసింది నువ్వు

దీపావళికి దాలీ, కాకా వున్నారు. అందుకని టపాకాయలు కొన్నాము. Candlesతో అలంకరించాము. ఆశ్రమం నించి ఫాద్విక్ అనే ఆరున్నర అడుగుల ఇంగ్లీషు ఆయన వొచ్చి, సీమ టపాకాయ సంగతి తెలీక, వెలిగించి చేతులో పట్టుకుని చేతులు కాల్చుకున్నారు. ఓ ఏరోప్లేనని తలకిందులుగా పెట్టి నాచేత ముట్టించారు. అది ఎగిరి నా లుంగీలో దూరింది. లుంగీ కాలింది.

మీరేం చేశారు?

రంగనాయకమ్మ గారు మంచి మంచివి చేశారు తినడానికి.

తొరగా నాకు Good News రాయి.

చలం.

సె ఖా3, 21/

నీ ఉత్తరం ఇన్నాళ్లకి మళ్లీ
పాపం చావు చూసి భయపడ్డావా,
విచారపడ్డావా? మరి ప్రపంచం
అంటే అంతే, వైరాగ్యానికేంలే, శ్మశాన
వైరాగ్యం ఎన్నాళ్లు! ఈపాటికి
మరిచిపోయి వుంటావు. Self
preservation చాలా బలమైన
instinct. అందువల్ల చావంటే
మనం లేకపోవడమంటే అంత కల
త కలుగుతుంది. కాని మనం వుం
డడమనేదే, ఈ కష్టాలకీ,
సుఖాలకీ కారణం - కాని
ఎంత బాధైనా జీవితాన్ని
వదులుకోలేము. దాన్ని జయించిన

నీ ఉత్తరం ఇన్నాళ్లకి మళ్లీ పాపం చావుచూసి భయపడ్డావా, విచారపడ్డావా? మరి ప్రపంచం అంటే అంతే. వైరాగ్యానికేంలే. శ్మశాన వైరాగ్యం ఎన్నాళ్లు! ఈపాటికి మరిచిపోయి వుంటావు. Self preservation చాలా బలమైన instinct. అందువల్ల చావంటే మనం లేకపోవడమంటే అంత కలత కలుగుతుంది. కాని మనం వుండడమనేదే, ఈ కష్టాలకీ, సుఖాలకీ కారణం - కాని ఎంత బాధైనా జీవితాన్ని వొదలుకోలేము. దాన్ని జయించిన వారే ధీరులు.

మీ పరీక్ష results విషయం, congratulations. అంతకన్న నాకేమీ ఈనాడు గట్టిగా పట్టవు. ఎంతకాలం? త్వరలో నీకు పట్టవు. ఎందుకంటే lifeలో ఇవి త్వరలో అందరూ మరిచిపోయే సంగతులు. కాని highగా pass అయ్యే మనలోని ప్రతిభ మనని జీవితంలో మనం కోరే గొప్పలకి



తీసుకుపోవడానికి వుపయోగపడుతుంది. అదృష్టం కలిసివొస్తే.

పుస్తకాల విషయం - ఈనాడు చదవడం మంచిది కాదనే అంటాను. నేనూ ఆ జాడ్యం పట్టిన రోగినే. ఈనాడూ ఒకటి రెండు గంటలు చదువుతోనూ వున్నాను.

నీకు సంగీతం, dance వొచ్చు. తెలివి, పరీక్షలో pass అయ్యే నేర్పు, ప్రజ్ఞ వున్నాయి. రూపం వుంది. ధనంకూడా వుందేమో? హోదా సంపాదనా రావొచ్చు. నిన్ను పొగిడి నీ అంతటి లేదనేవాళ్లకి ఏం లెఖ్ఖ పైగా నీలో ఒక ఆత్మా వుంది - అదే నన్ను ఆకర్షించింది. నీవు కామ వ్యాపారాలలో నేర్పరివే అయి ఉండవచ్చు. ఇయ్యడానికి హృదయమూ వుండవొచ్చు. కాని ఆ హృదయం నిన్ను ముంచెయ్యని హృదయం. అందువల్ల జాగ్రత్తగా వెడతావు కూడాను.

కాని హృదయమిచ్చే capacity వుంది. దాన్ని భద్రపరచుకునే జాగ్రత్తని నేర్చుకుంటున్నావు. కనక ప్రాపంచకంగా వృద్ధిలోకి వొస్తావు. అట్లాంటి వాళ్లకి నేనీనాడు రాసే మాటలు నచ్చవు. కాని రాశాను కదా - అంతకన్న నాలో ఈనాడు ఏమీ లేదు.

పోనీ పుస్తకాలే చదువు. నాకెందుకు రాస్తావు? నాకూ నీకూ ఉపయోగం లేని శ్రమ ఎందుకు?

నువ్వు ఎంత రాయి ఇంతే నేను. ఆనాడు అంతే నేను - అట్లా రాశాను, ఎవరేమనుకున్నా, ఈనాడు ఇంతే నేను, ఈనాడు ఇట్లానే రాస్తాను. కనక నన్ను నా గతికి వొదిలెయ్యి.

అయినా నానించి నీకు కావలసింది నీ కిష్టమైన రకం ఉత్తరాలే కదా! అట్లాంటివి రావు.

ప్రేమ లేఖలా! నువ్వు తలుచుకుంటే ఎన్ని ప్రేమలేఖలు ఎందర్నించి కురియవు? కాని వాటిల్లో ఎంతమాత్రం ప్రేమ వుంటుందో తూచి చూసుకో. లేఖలూ, మాటలూ, ఎన్నైనా అల్లగలరు నాలోటివాళ్లు, నీలోటివాళ్లు - మీ అమ్మమ్మ నిన్ను అన్నట్టు - కాయితం కలం వుంటే సరి!

నిజమైన నీ ప్రేమ, అనుభవమున్న ప్రేమ ఎప్పుడూ తనలో వున్న నిజాన్ని హితంగానీ, అహితంగానీ ఇతరులకి, తను ప్రేమించే వారికిస్తుంది. అంతకన్న గొప్ప ప్రేమ మౌనం వహిస్తుంది.

వకవక ఇక్కడే వుంది. మేమెవరం బెంగుళూరు వెళ్లం. బెంగుళూరు సంగతులు మాకు అంతకన్న ఏమీ తెలీవు.

బంధువులు అనేవారికీ మాకూ చాలా దూరం. అందుకనే నిన్ను 'చలం'

అని రాయమన్నాను.

ఆనాటి రాతలైనా, ఈనాటి రాతలైనా, నేను మనుషులు కులాసాగా చదువుకోడానికీ, వాళ్ళల్లోని కులాసాలనీ, ఇంద్రియ లోలత్వాలనీ, సమర్థించడానికి రాయలేదు. వాళ్ళ వ్యవహారాలకీ, బలహీనాలకీ, దౌర్బల్యాలకీ, వ్యభిచారాలకీ సమర్థన ఇస్తాయనుకున్న భావాలనే ఏరుకుంటారు. నా వుద్దేశ్యం నేను బోధించేవి అనుష్ఠించాలని. ఈనాడూ అంతే.

ప్రేమలేఖల్ని, ప్రేమనెరుగని వారు, చదివి ఏం లాభం? ఆ రాతల్లోని పై ఆకర్షణల్ని తీసేసి, నిజం ఈనాడు రాస్తే ఎందుకు సయిస్తుంది.

..... నీచత్వంలోకి జారకూడదు. గొప్పగొప్ప పేర్లతో, ఎప్పటికప్పుడు కీర్తిప్రతిష్ఠలకోసం దేవుళ్ళాడేవాళ్ళు నీ చుట్టూ వున్నారు. నువ్వూ అట్లాకాదు. నరకంలో కాలనీ, అందరూ విడవనీ, మనలోపలి సత్యానికి మనం నిలబడాలి.

సుఖాలకోసం దేవుళ్ళాటలో చేరితే, బాధని, lonlinessని భరించే శక్తి లేకపోతే, misunderstandingకి భయపడితే, ఆ మనుష్యుల్ని ఓ ప్రత్యేకం కింద చూడనవసరం లేదు.

నువ్వు నా దగ్గిరికి రావడం, ఏదో సుందరమైన కలలాగు విలువగా దాచుకున్నాను. ఎందుకు? నువ్వు నీ బంధువులమల్లే - నలుగురి ముద్రా మొహాన కొట్టుకుని, నడిచే పీనిగవైపోలేదు గనక. నువ్వు ప్రత్యేకమైనదానివని తెలుసుకున్నాను గనక. మా దగ్గిరికి బైటనించి వొచ్చేవారు నీ పేరెత్తితే పెదివి విరిచి నవ్వుతారు. అదేవాళ్ళు మనికి ఇవ్వగల గొప్ప compliment. నేనీనాడు ఏదో శాంతిని సంపాయించానంటున్నావే అది నేను compromise చేసుకుని కాదు నేనీనాడు 'ఈశ్వరుడున్నాడు' అంటే, 'ఈశ్వరుడు లేడు' అన్న కంటే వొణుకుతున్నారు. ఎందుకు? తరవాత ప్రశ్న ఈశ్వరుడు ఉంటే, అలా నువ్వు నమ్మితే, ఏం చేస్తున్నావు? ఇట్లా బతుకుతున్నావేం? అని వినపడుతోంది వాళ్ళకి.

మనం లోకానికి ఎంత విరుద్ధంగా వున్నా మన ప్రేమవల్ల లోకం మనకోసం రావాలిగాని, మనం లోకంవేపు భిక్ష అని చేతులు దేనికీ చాచకూడదు - చచ్చినా సరే.

'శాంతి' అంటే - ఇబ్బందులు లేని శాంతికాదు. మన హృదయంలోంచి వొచ్చే శాంతి. ఇక్కడ మేము చేసే సాధన, మామూలు సుఖాలకోసం కాదు. peace that is beyond understanding కోసం - అది సులభసాధనం కాదు.



సత్యాన్నించి దూరమై గతిలేక ప్రపంచాన్ని మింగితే ఆ శాంతి రాదు. ప్రపంచాన్ని ప్రేమించడమంటే దానిలోని shallownessనీ evilనీ కాదు. ఆ తుచ్ఛని tolerate చెయ్యి excuse చెయ్యి. నువ్వు ఆ levelకి దిగకు. ఎప్పుడూ తిరగబడుతూనే వుండు. accept చేసినట్టు నటించకు వాళ్ళ స్నేహాలు కోరి. పోతే పోనీ.

To think is the unhappy - సరే. think చెయ్యకండా లేవే! Think చెయ్యడానికి భయపడేవాడే think చెయ్యడు. అదే escapism.

అసలు thought అనేదాన్ని controle చెయ్యడం అది వేరే సంగతి. అది అరుణాచలంలో జరిగే యోగసాధన.

నా truth కి వెరచి ఎవరూ నన్ను దేంలోనూ చేరనివ్వలేదు. వొంటరిగానే బతికాను.

నీ కార్యక్రమాలన్నీ మంచివే. కాని వాటికోసం నువ్వు నీలోపలి valuable pastని బలిచేశావా? నువ్వు నశిస్తావు. అట్లా సంసారానికి high price payచేసి bankrupt అయిన skeletons నీ దగ్గరే వున్నారు.

అవును. escapism కాదు - కాని అది లేనివాళ్ళూ లేరు. ఈ కార్యక్రమాలన్నీ ఏమిటి. నిన్ను నువ్వు వొంటరిగా భరించలేకనేగా! ఈ గొప్ప బట్టలన్నీ ఏమిటి? నగ్నత్వాన్ని భరించలేకనేగా! నేను, ఈనాడు శాంతిని సంపాయిస్తే, జీవితమంటే వొంటరిగా, uncompromisingగా నుంచోదం వల్ల సంపాయించాను. నీవు చేసే రకం పనులు నేను ఎన్నడూ చెయ్యలేదు. నన్నెవరూ చేరనియ్యలేదు. నిజానికి నిల్చుంటే నిన్నూ ఈనాడూ ఎవరూ చేరనియ్యరు.

మామూలు మనుషులు పొందే శాంతి ఎప్పుడూ నా graspలోనే వుంది. కాని నేను దాన్ని వొప్పుకోలేదు. ఆ పీనిగ శాంతికన్న బతికి వుండగా నిప్పులో కాలడమే నయం - ఈ కీర్తులూ, డబ్బులూ, ఆస్తులూ, సంసారాలూ, ఉద్యమాలు కార్యకలాపాలూ.

కాని ఎవరోగాని ఆ అగ్నిపరీక్షని తట్టుకోలేరు. అందులో ఆడపిల్లవి. నీ చుట్టూ ముళ్ళకంచెలు పైగా. నిన్ను కోప్పడుతున్నాననుకోకు. కాని అహహా బావుంది అని తల వూపలేను. 'తాతయ్యా' అని నన్ను గొప్పచేసి ఇన్నాళ్ళకి రాశావు కదా, నిన్ను పొగిడితే, నాకేమన్నా మామిడిపళ్ళు పంపుతావేమోనని! (జ్ఞాపకముందా మామిడితోట కల!)

# V

చలం రాతలు, చేష్టలు, ఆయన కుటుంబ సభ్యుల జీవితాల గురించి నేను ఏదో ఒక పేచీ లేవదీసేదాన్ని.

ఒకసారి ఉదయంపూట, 9-10 గంటల మధ్య చెట్ల నీడలో మేమిద్దరం కూర్చున్నాము. ఆయన మంచంమీద పడుకునేవారు. నేను పక్కనే కూచునేదాన్ని. అప్పుడు పకపక చిందెతో నీళ్లు తెస్తోంది. 'చూడు, యిక్కడున్నవాళ్లకి – నీకున్నవి ఏవీలేవు. నీకు డబ్బు, చదువు, అందం వున్నాయి. వాళ్లకి లేవు' అన్నారు. అంటే పకపక, చిత్ర, దాలీ, నర్తకి అన్నమాట. నేను వెంటనే 'అల్లా వాళ్లకి లేకపోవడానికి కారణం ఎవరు?' అన్నాను. ఆయన మాట్లాడలేదు.

ఒక కొడుకు రవి చిన్నినాడు చనిపోయినా, మరొక అబ్బాయి వసంత్ (సంతి) కనబడకుండా మాయమైపోయినా, ఆడపిల్లలు ముగ్గురు సంప్రదాయమైన గృహిణులుగా స్థిరపడలేకపోయినా, భార్య మనస్సు విరిగి ఎన్నో ఏళ్ల కాషాయ బట్టలు కట్టుకుని వూరూరు తిరిగినా – వాటికి బాధ్యత తనదే అని అనుకున్నా – బయటికి చెప్పని వ్యక్తి ఆయన. లోక రివాజుగా చూస్తే ఇవన్నీ బాధ్యతలేని పనులే. జీవితమే కర్తవ్య నిర్వహణకోసం అంకితం చేయాలని, కన్నవారు, కట్టుకొన్నవారు, మనం కన్నవారికోసం త్యాగాలు చేస్తూ, ధర్మం నిర్వర్తించడంలో గడపాలని నమ్మిన నాకు – చలం ఎంత దూరం! ఇల్లాంటి పోటుకు మాటలూ అనేదాన్ని. ఐనా ఆయన నన్ను చిరునవ్వుతో క్షమించారు.

నీకు డబ్బు, చదువు, అందం వున్నాయి. వాళ్లకి లేవు' అన్నారు. అంటే పకపక, చిత్ర, దాలీ, నర్తకి అన్నమాట.



నిండా ముప్పై ఏళ్లు లేనినాడే ఆయనలో అశాంతి ప్రారంభమైంది. అది రగిలి, రగిలి ఆయన్ని జ్వాలగా మార్చింది. అది ఆయన్ని కాలుస్తున్నా, కొందరికి వెలుగునిచ్చింది.

స్త్రీ – బిడ్డల పెంపకం వంటి అంశాలపైన ఆయన సలహాలు, అభిప్రాయాలు, 70 ఏళ్ల నాడు ఎంత ఆధునికమో! ఆయనలోని ఉదారతకు, పరిమళించే మానవత్వానికి, మధురమైన మాతృత్వానికి సంబంధించిన భావాలకు ఆయన రచనలు ఎంత గొప్ప పుష్టినిచ్చాయో గమనిస్తే – వ్యక్తిగత జీవితంలో యివన్నీ ఎందుకు ఆచరించలేదు – ఒక భర్తగా, తండ్రిగా, కొడుకుగా ఎందుకు విఫలమైనాడు అనే ప్రశ్న వస్తుంది. కాని అలా అనే హక్కు మనకు లేదేమో!

ఇది అసలు పేచీ. ఆయన బాధ్యతలేని పేరెంటు అని, భర్త అనీ నేను నమ్మడమే కాక, కొంత సూటిపోటిగా ఆ మాటలు అనేదాన్ని. క్రమశిక్షణకు, నైతిక విలువలకు, చదువుకీ, రుజువర్తనకీ, సత్యసంధతకీ ఎంతో విలువనిచ్చే ఆదర్శ ఉపాధ్యాయుడు మా మాతామహుడు దుర్ల పట్టాభిరామయ్య గారి పెంపకంలో నేనున్నాను. నాకు చలం చేసిన 'భ్రష్టపు' పనుల గురించి ఏవో అభిప్రాయాలుండేవి.

దానికి ఆయన్ని దూరం పెట్టక, నా వయస్సుకి మించిన సంగతులు ఆయనతో ప్రస్తావించేదాన్ని. నా ఉత్తరాల్లోనూ అదేవిధంగా దుయ్యబట్టడం, ఎదురు ప్రశ్నలు వేయడం, మర్యాద మరచినట్లు, ఏవో రాతలు.

ఆయన వాటిని సహించారు. 'నోరు మూసుకో' అనలేదు. 'నేనెందుకు సంజాయిషీ యివ్వాలి?' అనలేదు. అది ఆయన గొప్పతనం. నేను ఆ రోజుల్లో ఒక పైకం స్థితిలో వున్నాననుకొంటాను. నేను బయటి ప్రపంచంతో మసలుతూ, బి.ఏ, ఎమ్.ఏ.లు పాసైపోతూ, కాలేజీ కార్యక్రమాల్లో అతి చురుకుగా, అన్నిటా ముందు వుంటూ కూడా – చలంతో ఒక ప్రత్యేక ధోరణి బంధాన్ని పెంచుకున్నానంటే, నేను చాలా దొంగని అయివుండాలి.

పాపం, చివరి ఉత్తరం వరకు ఆయన నన్ను చాలా సీరియస్‌గా, ఒక మనిషిగా పరిగణించారంటే, అది నా అదృష్టం. తన ఆత్మను ముందు లోకానికీ, ఆ తర్వాత ఈశ్వరుడికీ పూర్తిగా విప్పి చూపారంటే, నివేదన చేశారంటే – ఆయన నగగంభీరుడని అర్థమౌతుంది. ఆయన ముందు పిచ్చిగంతులు వేసిన చిన్న పిచికలాంటి దానను.

ఆయన బాధ్యతలేని పేరెంటు అని, భర్త అనీ నేను నమ్మడమే కాక, కొంత సూటిపోటిగా ఆ మాటలు అనేదాన్ని.

రెండో పేచీ ఈశ్వరుడి గురించి. సౌరిస్‌ని ఆయన ఈశ్వర రూపంగా భావించారు. దుర్భరమైన తన 'మైగ్రేన్' తలనొప్పిని, నోట్లో మంత్రభస్మం వేయడం ద్వారా తగ్గించిన మహిమాన్వితురాలు అని ఆయన అనేవారు. 'షా' ప్రశ్నలకు జవాబులిస్తుంది, వెళ్లు అని నర్తకి నన్నొకసారి ఆమె చిన్నగదిలోకి తోసింది. తర్లైను తీసి వెళ్లి, నగ్నంగా వున్న ఆమెను చూసి భయపడి బయటికి వచ్చేశాను. నాకు ఏమీ ప్రశ్నలు లేవు అని ముఖాన చెప్పలేక మొహమాటపడి తప్పించుకున్నాను.

నేను అప్పటికీ, యిప్పటికీ భగవంతుడున్నాడని నమ్మలేదు. ఈ సృష్టి స్థితి, లయలను నిర్వహిస్తున్న ఒక మహాశక్తి వుందేమోకానీ, నాకు పరిచయం లేదు. ధ్యానం, విశ్వాసం అనేవి లేని సాదా మనిషిని. నాస్తికురాలిని కానుగానీ, నాకు భగవంతుడనే ఆ 'ఔషధం' యింతవరకూ అవసరం కాలేదు. నాలోని ఆత్మవిశ్వాసం, కళ్లకు కనుపించే వాటిని కూడా ప్రశ్నించే ఒక విరగబాటుతనం యిందుకు కారణం కావచ్చు. జరిగేది జరుగక మానదు - అది మనం ఎలా స్వీకరిస్తామో, నెత్తికి ఎత్తుకుంటామో అది మనం చూసుకునే సంగతి - ఏ గొప్ప శక్తీ కూడా నీకు తోడుగా నిలచి, నిన్ను రక్షించదు - అని నాలో ఒక మొండి ఆలోచన.

అందుకే నేను చలం వుత్తరాల్లో, యిలాంటి మాటలు వ్రాసేదాన్ని. ఆయన దాన్ని సమర్థించుకోవడానికి, పాపం, ఎంతో ప్రయత్నించేవారు. అది ఆయనకు ఎంత శ్రమ కలిగించి వుండాలో!



# VI

చలం లాగ తెలుగు వచనం వ్రాసినవాళ్లు, వ్రాయగలిగినవాళ్లు లేరు - పుట్టరు అని నా నమ్మకం. కడిగి, తుడిచినట్లున్న వినీలాకాశం వలె స్వచ్ఛమైన వ్యక్తి ఆయన. పరిహాసానికైనా, చమత్కారానికైనా, తన భావాలకు అందమైన అబద్ధాలు చుట్టి ఆయన ప్రదర్శించలేదు. తన బలహీనతలను, తన జీవితంలోని నలుగురూ ఎగతాళి చేసి, దాదాపు వెలివేసిన సంగతులు ఎందుకు ఆయన భరించారు? వాటిని బహిరంగంగా అక్షరాలలో ఎందుకు చెప్పుకొన్నారు?

'చలం సిద్ధాంతాలు యీనాటి సమాజానికి పనికివస్తాయా?' అని కాలోలు తెలుగు విశ్వవిద్యాలయం వారు నాకు ప్రసంగ విషయంగా యిచ్చారు. ఎంత శక్తివంతమైన భాష వ్రాసినా, ఎంత విప్లవకరమైన ఆలోచనలు, సిద్ధాంతాలు, దివ్యకాంతులు వెదజల్లిన రచనలు చేసినా - ఆయనను ఆలంబన చేసుకున్న వారి జీవితాలకు ఆయన లౌకికమైన అభ్యుదయం సమకూర్చడానికి ప్రయత్నం చేయలేదు - కనుక ఆనాటికే, ఆయన వ్యక్తిత్వ జీవితానికే అవి సరిపోలేదు. ఇప్పుడు మాత్రం ఎలా సరిపోతాయి అని ప్రశ్నించి ప్రసంగించాను.

ఆయనను ఆలంబన చేసుకున్న వారి జీవితాలకు ఆయన లౌకికమైన అభ్యుదయం సమకూర్చడానికి ప్రయత్నం చేయలేదు

ఆయన నాకు తాతగారు. 42 ఏళ్లు పెద్దవాడు. ఆయన మీద తీర్పులు చెబుతూ, ప్రేలాపన చేయడం నాకు తగదు. కానీ చలం పేరు వింటేనే పరవశమైపోయే వాళ్లను చూస్తే నాకు యీ ముక్కలు అనాలనిపిస్తుంది. ఆయన్ని చదవడం, ఆ ధోరణిలోనే మాట్లాడ్డం,

వీలుంటే, తప్పనిసరైతే ఆయన చెప్పిన సంగతులు తమ జీవితంలోకి ఆహ్వానించి, జీవన సరళిని మార్చుకోవడం - యిది ఒకవిధంగా ఫ్యాషనబుల్, మరోవిధంగా స్వంత సౌకర్యానికి పనికిరావచ్చు. అది వ్యక్తిగతం, అది వారి వారి యిష్టం. కానీ అదే ఎంతో ఉత్తమమైన పద్ధతి, అదే ఆదర్శమైన జీవితం అని నలుగురికీ బోధించడం నేను సహించలేను. ముఖ్యంగా స్త్రీ - పురుష సంబంధాల విషయంలో.

చలాన్ని తలచుకుంటే - కనీసమైన అవసరాలు కూడా పట్టించుకోని యోగిగా, భావాల మథనంలో హాలాహలం తన గొంతులో దాచుకున్న శివమూర్తిగా స్ఫురిస్తారు. తను వ్రాసిన ప్రతిమాటనూ నమ్మి, తననే ఆరాధిస్తూ, తమ మానసిక, ప్రణయ సంబంధ, వివాహవిచ్ఛేద సంబంధమైన చిక్కులను గురించి చెప్పుకునేవారికి, తన విలువైన కాలాన్ని వెచ్చించారు. ఎంతో దూరాలనుంచి తనను చూడవచ్చిన వారికి రోజుల తరబడి ప్రేమగా అన్నం పెట్టారంటే ఆయనకి ప్రణమిల్లాలి. తనకి వున్నా లేకపోయినా పెద్ద సంసారానికి ఆశ్రయమిచ్చారు. అదొక ప్రత్యేకమైన వాతావరణం. పరస్పర గౌరవం, మనుష్యులుగా ప్రతివారినీ అంతస్తులు మరచి ఆదరించిన ఉదారాశ్రమం.

సముద్రం మహాశక్తి. చైతన్యరాశి, భూమిని ముప్పావుభాగం ఆక్రమించింది. మనకి తెలిసినది లవణ సముద్రం ఒక్కటే. అదంతా ఉప్పునీరు అని ముద్రవేసి, ఎనలైజు చేసి, 'desalinisation' చేయాలనుకోవడం ఎంత తప్పు! ప్రకృతి పట్ల ఎంత అపచారం!

అలాగే - చలం విషయంలోనూ నేను ఏమి తలచినా, ఏమి మాట్లాడినా, ఏమి వ్రాసినా అదంతా నా అల్పత్వాన్ని సూచిస్తుందే కానీ, ఆయన మహనీయతను కాదు.



[illegible]

నీ ఉత్తరం ఆశ్చర్యజనకంగా. నువ్వు నా ఉత్తరానికి అనాడు జవాబు రాయకపోతే, నీ కలాన్ని ఎవరో మీ బంధు దుష్టులు విరిచేశారనుకున్నాను. నీ ఉత్తరాల జోరు చూస్తే, అంత abruptగా మానేస్తావనుకోలేదు. కాని మిత్రులు నిష్కారణంగా పలుకులేకుండా మాయం కావడం అలవాటైన చలం ఈ నిరుత్తరాన్ని కూడా ఓర్చుకోగలిగాడు.

నేను లెఖ్ఖల్లో తప్పు పెద్దవాణ్ణి కావటం లేదు. నువ్విప్పుడొచ్చి నన్ను చూస్తే, ఎలా ఇంత చిన్నవాడివి కాగలిగావు. నాకు నీ widowని కావాలనిపిస్తోంది" అంటావు.

అవును. నీ ఉత్తరమే చెపుతోంది. నువ్వు మారుతున్నావని, పాతుకుపోతున్నావని.

నీ ప్రియుడేమైనాడు, నీ పెళ్లి ఏమయింది?

నువ్వు ఉత్తరాలు రాయకపోయినా, నువ్వు వస్తానన్న వేసవి తేదీకి ఇక్కడ

వుంటావని నాకు విశ్వాసం వుండేది.

ఇన్నేళ్లు యుద్ధం చేశాడు చలం భార్యల్ని భర్తల దౌర్జన్యాల నించి, అధికార బంధాల్నించి తొలగించేందుకు!

కాని భర్తకన్న తెగని సంకెళ్లతో బంధించే చదువులనించి, కుంగతీసే ఉద్యోగాలనించి స్త్రీలని తప్పించాలంటే ఎవరు అవతారమెత్తాలో!

నాలో interest కలిగించాలంటే, ఏం రాయాలనికాదు. ఎట్లా రాయాలని! నీ ఆత్మ జీవించి ఉన్నంత కాలం నాకు సరదా ఏం రాసినా? అది చచ్చిపోతూవుంటే, నేను ఏడుస్తున్నాను నీతో కలిసి.

నువ్వు ఎట్లా వొదిలి వెళ్లావో అట్లానే వున్నాం. ఆవులు పెరిగాయి. విడవకండా మారిమారి అతిథులు మమ్మల్ని అనుగ్రహిస్తున్నారు. ప్రతి వొక్కరూ ఇదివరకు కన్న శాంతంగా సంతోషంగా, ఆరోగ్యంగా, ఐశ్వర్యంగా ఉంటున్నాము. ఇందంతా నీ విరోధి ఈశ్వరుడి అనుగ్రహం.

ఓ ఏడాదినించి పెద్దక్కయ్య ఇక్కడ వుంది. ఇప్పుడు హైద్రాబాదు పోవాలని, ఏదన్నా aroplane గాని, పిచికగానీ మిడతగాని తనని తీసుకుపోతుందేమోననే ఆశతో చూస్తోంది ఆకాశంవైపు.

చిత్ర తన కొత్త పాప 'కాకా'తో ఇక్కడ వుంది ప్రస్తుతం.

"అమ్మమ్మ" అక్కడికి వొచ్చిందంటున్నావు, ఎవరా అమ్మమ్మ?

తప్పకండా రాస్తాను.

నా widowకి నేను రాయకండా ఎట్లా వుండగలను?...

శారదని అడిగానని చెప్పు. మీ డాక్టర్ని అడగలేదని చెప్పు.

మీ ఇంటి ముందు పువ్వులతో ఈనాటికీ హైద్రాబాదు గృహప్రాంగణోద్యాన పుష్పసౌందర్యానికైన చలం విరహం చలానికి మరుపురానిదని చెప్పు.

ఏమిటీ బతుకు!

ఎందుకీ బతుకు?

అనే ప్రశ్న బైలుదేరిన రోజున చలాన్నడుగు. అరుణాచలంరా.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

(ఉత్తరాలు రాసే ఆసక్తి నాకు లేదు ప్రస్తుతం. కానీ నీకు మాత్రం - ఎప్పుడూ ఉత్తరాలలో నీ వాణ్ణి)



[illegible]

ఇవాళ ప్రారంభించాను. ఎప్పటికి ముగుస్తుందో, రోజుకి నాలుగు వాక్యాల చొప్పున - అంతకన్న తీరుబడి వుండదు 8, 9 గంటల మధ్యనే ఏం రాసినా. తరవాత రాయడం చాతకాదు.

నిన్న అనుకోకండా Xmas celebrate చేశాం. గొప్పగా జరిగింది ఈశ్వర కరుణవల్ల.

ఈశ్వరుడి సంగతి ఎత్తకండా ఉత్తరం రాయమంటావు. ఈనాడు నాతరంకాదు. కలం మొదలైనవి లాగేసి రాయమన్నట్లే... నీ దగ్గర్నించి ఉత్తరం రావడం, బేబీ నా జీవితానికి దగ్గరిగా రావడమనేదే, ఈశ్వర చిద్విలాసంగా కనపడుతుంది. నీ ఉత్తరంలో వీలైనంత వరకు ఈశ్వరుడి పేరెత్తను. కాని ప్రతి అక్షరమూ ఈశ్వరుడు రాయిస్తున్నదే! ఈ కాలంలో

నేనేం రాసినా, ఆయనే రాయిస్తున్నారు.

నువ్వు నాకు పరిచయమైన రాత్రి, "ఏమిటిది?" అని అద్భుతపడి చూశాను. గర్వంతో పెరిగాను. ఆకాశం వంక చూశాను. నీనించి ఉత్తరం వొచ్చినప్పుడల్లా, ఆశ్చర్యపడతాను. నా జీవితంలో ఇదివరలైతే నిన్ను గొప్ప వరంగా తీసుకునేవాణ్ణి. కాని ఈనాడు - ఈశ్వరుడి పేరెత్తవద్దన్నావు గనక జాతక ప్రభావం, అంటాను నువ్వు రావడం. పైగా వొచ్చి చూసి "సరే, చలాన్ని చూడడమనేది జరిగింది. చాలు" అని వెళ్లిపోక, appointmentలోనూ disappointmentలోనూ, నాతో బంధం అట్లా వుంచుకోడం-

నువ్వు జ్ఞానవంతురాలివి, అర్చిస్టువి - యవ్వనవతివి - నీ స్నేహాన్ని ఎవరు తేలికగా తీసుకోగలరు?

ఇది నాకు ప్రేమలేఖల కాలం. ఎంతమందో మధురమైన లేఖలు రాస్తున్నారు - అందరూ కుర్రాళ్లు.

ఈశ్వరుడు అంటారు - మళ్లీ ఈశ్వరుడంటున్నాను. ప్రతాపరుద్రుడు నాటకంలో. "నీ పుస్తకాన్ని ఇంకెవరికన్నా అంకితమియ్యరాదా?" అంటే విద్యానాథుడు "ప్రతి శ్లోకంలో అతని పేరే తగిలేశాను" అంటాడు.

అట్లా ఈశ్వరుడి పేరు నాకు - "నా తలపు లోపలి తళుకుగా నా పలుకులో పరమార్థముగ నా పనుల లోపలపు పటిమగా విడివడని దీక్షగా, రక్షగా..." చలాన్ని పలకరించాలంటే ఈశ్వరుణ్ణి తప్పించుకోలేవు.

పూర్వం ఎవరో వొకరు ప్రియురాళ్లు అడ్డం, ఈనాడు నా ప్రియుడైన ఈశ్వరుడు అడ్డం.

'I am a Jealous God.'

సరేలే - ఇంతకీ

ఈశ్వరుడేమంటారంటే

"ఎన్నడన్నా ఏ స్త్రీనించైనా ఇంత గొప్ప ప్రేమలేఖలు వొచ్చాయా నీకు!" అని.

కాని బేబీ, ఆడపిల్ల, ఆర్టిస్టు, ప్రత్యేకంకాదా చలానికి? ఉత్తరాలు కాకపోయినా ఆమెనించి ఉత్తరం వొచ్చిందంటే గర్వంకాదా?

ఏమిటి? నీ దస్తూరి ఇట్లా అయింది? కలం తప్పా? సిరా తప్పా! నీ దస్తూరి తప్పా! చలం దురదృష్టమా! ఒక్కొక్క అక్షరం విడదీసేప్పటికి, నా కళ్ల నరాలు పీక్కుపోతున్నాయి. నీ ఉత్తరం వొచ్చాక, ఓ మిత్రుడికి రాశాను "దస్తూరి classలో నీకూ నాకూ ఒక place promotion అయింది. మనని మించిన దస్తూరి దిగిందని" ఈసారి ఇట్లానే రాశావా, నీ ఉత్తరంతో నువ్వూ



దిగితేనేగాని వొప్పుకోను.

మళ్లీ ఇవాళ ప్రారంభించాను. ఇంక ముగిస్తాను.

అవును. నా చివరి ఉత్తరంలో నిన్ను harshగానే treat చేశాను. నిన్ను అర్థం చేసుకోలేదనిపిస్తోంది ఇప్పుడు. details జ్ఞాపకం లేకపోయినా.

ఈ ఉత్తరం చూస్తే, నువ్వూ మారినట్లే కనపడుతున్నావు. నువ్వు రాసింది నిజమే.

నువ్వు ఇన్ని scenes లోంచి నడుస్తున్నా, నన్ను ఏమాత్రం మెప్పుతోని వాతావరణంలో పెరిగి కూడా, నేను నిన్ను వొదుల్చుకోవాలని చూసినా, నన్నిట్లా గుర్తులో పెట్టుకుని, నీ మనసులో పెనవేసుకుని వున్నావంటే, పూర్వజన్మల్లో ఎన్నో బలమైన బంధాలతో నన్నల్లుకున్నావేమో ననిపిస్తుంది. కాకపోతే నీకు నాపైన వున్న పట్టుకు అర్థం కనపడదు.

నీ hoste వర్ణన చూస్తే నాకు చాలా ఈర్ష్యగా వుంది. నేను నిన్ను చూడదానికి రాకూడదా? "మా తాతయ్య, చాలా harmless" అని నువ్వు చెపితే, hostel వారు నన్నూ నిన్నూ 'పుష్పమంటపాలలో', తామర కొలనుల వొద్దున. లతానికుంజాల చీకటి మూలల తిరగనిస్తారేమో! Lover's Rock ఇంకోరికి reserve అయింది గనక.

అంత అందంలో నువ్వు ప్రత్యేకం నన్నే తలుచుకుంటున్నావంటే, నేను చాలా సౌందర్యోపాసకుణ్ణే అవ్వుండాలి. ఇప్పుడు ప్రకృతిని మించిన సౌందర్యాన్వేషనలో వున్నాను. ప్రకృతికి సౌందర్యానికి సౌందర్యమిచ్చే శృంగార దేవతని అర్చిస్తున్నాను.

వెలుగు లోపల వెలుగు తానై వెలిగే దేవిని.

బేబీ, ఇంక సంశయపడకు. నిన్ను disappoint చెయ్యను. నిన్ను కోప్పడను. నా వొళ్లో కూచోపెట్టుకుని, నిన్ను నా దగ్గిరికి తీసుకుని నీ కబుర్లన్నీ వింటాను. నీవు నావల్ల గాయపడ్డావంటే, నాకు చాలా దిగులుగా వుంది.

మానవుడి హృదయం వుందే, అది వుత్త జిగురు. దేనిపైనన్నా సాగిందా. అతుక్కుంటుంది వొదలదు. అందులో నాది మరీని. అతుక్కుంటుంది, ఆక్రమించుకుంటుంది, మింగుతుంది.

మింగలేక కొట్టుకుంటుంది. ఈ ముళ్లేమిటి అని తగాదా పెడుతుంది, తిడుతుంది, చివరికి ద్వేషిస్తుంది.

ఈశ్వరుడెంత కదిగినా, కోసినా, ఈ గుణం నావంటి వాడిలో నశించడం కష్టం. అందువల్ల వొదిలించుకోవాలని, దూరం కావాలని ప్రయత్నం.

నువ్వు రాస్తున్నావే! Thrills and ecstasies అని అవే నా విరోధులు ఈనాడు. నా అధ్యాత్మిక మార్గానికే కాదు, నా వయసుకిక ముఖ్యం. ఆ సంగతిని మరిచానా, నా దృష్టికి నేనే పుత్ర contemptable foolని అవుతాను.

1916లో పుట్టాలనుకున్నావా! నన్ను రక్షించి 36లో పుట్టావు. 16లో పుట్టి నన్ను వెతుక్కుంటూ వొచ్చావా? ఇద్దరి జీవితాలకీ tragedy జరిగేది. కరుణ గల ఈశ్వరుడు సరిగా ఎప్పుడు పుట్టాలో అట్లానే ఏర్పాటు చేశారు. నా మిత్రుడు రామ్మూర్తి రాశాడు ఓసారి చిన్నప్పుడు.

If I had been rich, I would have printed and freely distributed all your works and if I had been a woman I would have satisfied all your romantic longings with my charms-

అని.





ఓ బేబీ

నీ ఉత్తరం అందింది. అప్పుడే రాస్తావనుకోలేదు. Pleasant surprise. బొంబాయినించి. చే ఇక్కడ వుంది. రేపో ఎల్లుండో వెళ్లిపోతోంది తిరిగి.

నువ్వు కలం మార్చినా, కొన్ని భాగాలు నీ ఉత్తరం చదవడం కష్టమయింది. నాకు ప్రేమలేఖలు రాసేవాళ్లల్లో ముఖ్యుడు ప్రసాద్ అనే అబ్బాయి. అతను నా దస్తూరిని, నేను అతని దస్తూరినీ విసుక్కుంటో వుంటాము. మా ఇద్దరి ఘోర దస్తూరీదారుల సమాజంలో నిన్నూ memberగా చేర్చుకున్నాము. అతనూ ఏదో I.A.S. పరీక్షకి వెడతాడుట. మీ ఇద్దరి examiners మీదా వుంది నా సింపతీ అంతా. మీ దస్తూరి బాధ పడేది కొద్దిమందే. ఇన్నేళ్ల నా దస్తూరి బాధని, నా తెలుగు దేశపు Press compositons & Publish-

నువ్వు రాస్తున్నావే! Thrills and ecstasies అని అవే నా విరోధులు ఈనాడు. నా ఆధ్యాత్మిక మార్గానికే కాదు, నా వయసుకిక ముఖ్యం. ఆ సంగతిని మరిచానా, నా శక్తికి నేనే పుత్ర contemptable foolని అవుతాను.

1916లో పుట్టాలనుకున్నావా! నన్ను రక్షించి 36లో పుట్టావు. 16లో పుట్టి నన్ను వెతుక్కుంటూ వొచ్చావా? ఇద్దరి జీవితాలకీ tragedy జరిగేది. కరుణ గల ఈశ్వరుడు సరిగా ఎప్పుడు పుట్టాలో అట్లానే ఏర్పాటు చేశారు. నా మిత్రుడు రామ్మూర్తి రాశాడు ఓసారి చిన్నప్పుడు.

If I had been rich, I would have printed and freely distributed all your works and if I had been a woman I would have satisfied all your romantic longings with my charms-

అని.



18/1.

ఓ బేబీ

నీ ఉత్తరం అందింది. అప్పుడే రాస్తావనుకోలేదు. Pleasant surprise. బొంబాయినించి. నే ఇక్కడ వుంది. రేపో ఎల్లుండో వెళ్లిపోతోంది తిరిగి.

నువ్వు కలం మార్చినా, కొన్ని భాగాలు నీ ఉత్తరం చదవడం కష్టమయింది. నాకు ప్రేమలేఖలు రాసేవాళ్లల్లో ముఖ్యుడు ప్రసాద్ అనే అబ్బాయి. అతను నా దస్తూరిని, నేను అతని దస్తూరినీ విసుక్కుంటో వుంటాము. మా ఇద్దరి ఘోర దస్తూరీదారుల సమాజంలో నిన్నూ memberగా చేర్చుకున్నాము. అతనూ ఏదో I.A.S. పరీక్షకి వెడతాడుట. మీ ఇద్దరి examiners మీదా వుంది నా సింపతీ అంతా. మీ దస్తూరి బాధ పడేది కొద్దిమందే. ఇన్నేళ్ల నా దస్తూరి బాధని, నా తెలుగు దేశపు Press compositons & Publish-

ers భరించారంటే, వాళ్ల పోషణని మెచ్చుకోవాలా? నేను రాసిన matter యొక్క irresistabilityని తలుచుకోవాలా?

నా పుస్తకాలు క్రమంగా అచ్చవుతున్నాయి - ముందు నా నవలలు - అన్నీ చదివావా ఏమన్నా కావాలా?

అచ్చయినవీ, అయేవీ.

1. అరుణ 2. హంపీ కన్యలు 3. వాళ్లు నలుగురు. 4. దైవమిచ్చిన భార్య 5. వివాహం 6. అమీనా 7. బ్రాహ్మణీకం 8. జీవితాదర్శం 9. మైదానం.

నీ దస్తూరికి నేను వంకపెట్టటంలేదు. అక్షరాలు తెలీక గోలపడుతున్నాను. నీమీద ఎప్పుడూ అసలు కోపం రాలేదు నాకు. అది ఇప్పుడు తగ్గడానికి.

నన్ను ఈశ్వరుడి పేరు ఎత్తవద్దని, నువ్వు ఎన్నిసార్లు ఎత్తావు! 'ఈశ్వరుడు' అని కాదనుకో. వేరే పేర్లతో - నీ ఉత్తరమంతా ఈశ్వరుడి సంగతి నువ్వు తేకుండా రాసిన చోట్లన్నీ under line చేసి తిరిగి నీకు పంపాలని వుంది.

అయినా, ఈశ్వరుడితో నీకు తగాదా ఎందుకు? ఇన్నేళ్లా నేను తగాదా ఎందుకు పెట్టానో నీకు తెలుసు. కాని తీరా చూస్తే, నేను ఏ విషయాలపై, ఈశ్వరుడితో తగాదా పడ్డానో, ఆయన వుండదానికి వీలులేదన్నానో, ఆ విషయాలు, ఆయనలో లేనేలేవు. ఇంక నాకు తగాదా ఎందుకు?

చలంలో ఇవి వున్నాయని ఒకడు నన్ను అనేక ఏళ్లు ద్వేషించాడు అనుకో నన్ను చూడకుండానే. ఎట్లాగో నన్ను చూడడం తటస్థించింది. నాలో ఏవి తనకి గిట్టనివి వున్నాయనుకున్నాడో అవి నాలోలేవనుకో. నన్నెరగనివారు నా విరోధులు అతనితో అబద్ధాలు చెప్పారని గ్రహించాడు. అప్పుడు చలాన్ని గురించి ద్వేషం మానడా! అప్పుడు అతను నాకు లొంగిపోయినట్టా! ఇట్లా ఎంతమంది మారారో నా యెడల!

ఈశ్వరుడు సాధారణ మానవులు అనుకునే ఈశ్వరుడు కాదు. ఆయనకి లేనివన్నీ ఉన్నాయని ఆరోపించుకుని మనం ఆయన్ని ద్వేషించడం గాని అనవసరమనడం గాని న్యాయమా! నువ్వేమెరుగుదువు? తెలుసుకోడానికి ఏం ప్రయత్నించావు?

నా సాధన వల్ల నేను ఆయనకి కొంత సమీపమై, కొంత తెలుసుని మాట్లాడుతున్నాను.

నన్నీనాడు నీముందు ఎవరన్నా తిడితే, "నీకేం తెలుసు చలం సంగతి? చదివావా? చూశావా? మాట్లాడావా? ఏమి చెయ్యక, ఎందుకు తిడతావు?" అనవా?



నన్ను చూసి ఎంతమంది నామీది ద్వేషాన్ని మానుకున్నారో? నా పుస్తకాలు అర్థంకానివాళ్లు!

నా పుస్తకాలనే అర్థం చేసుకోని వాళ్లు, ఈశ్వర సృష్టిని అర్థం చేసుకోగలరా?

ఈశ్వరుణ్ణి గురించి చెప్పే ఆయన భక్తులనబడే అల్పజ్ఞులవల్లా, దొంగలవల్లా ఆయన పేరు పాడయింది. ఆయన విరోధుల వల్ల కన్న.

ఇవాళకి ఇక్కడ ఆపుతున్నాను. బోలెడు పని. ఎన్నో ఉత్తరాలు జవాబులు రాయవలసినవి. బంధువుల నించి మాత్రం కాదు. వాళ్లనించి ఇన్నేళ్లు రక్షణ కల్పించుకున్నాను - ఒకనొక మనమరాల్నించి తప్ప. ఆమెని తప్పించుకోలేక పోయినాను. తప్పించుకోవాలనీలేదు. ఆమె నా మిత్రురాలయింది గనక.

నువ్వు చెప్పుకుంటున్నావు ఇక్కడికి వొచ్చినప్పుడు నువ్వు చాలా happyగా వున్నావని. నాకు తెలుసు నువ్వు నీ లోపల్నించి move అయినావని. ఎందుకు? చలం వల్లననుకుంటున్నావు. నువ్వన్నట్లు కాలానికి లొంగి మూర్ఖంలో పడ్డ నాలో, ఇక్కడ తక్కినవాళ్లలో, ఏం చూశావు? మూర్ఖపు భక్తుల్ని చూసి అసహ్యించుకుని పోవలిసిందే మరి! కాలానికీ, మూర్ఖానికీ లొంగిపోతే, నాలో ఇంక ప్రత్యేకత ఏముంది? ఇంక నాలో నీకు ఈ విశ్వాసమెందుకు? నీకు చాలా దగ్గిరగా బందరులో ఓ తాతయ్య వున్నాడుగా, ఏ మార్పూ లేకుండా, ఒకే తారురోడ్డు మీద నడుస్తో! (మా బావగనక పరిహాసమాడుతున్నాను. ఆయన సంగతి నాకెందుకు?)

నీ మనసు నేర్చుకున్న అలవాట్లకు రుచించలేదు గనక నీకూ రుచించలేదు గాని, నువ్విక్కడ చూసింది Truth and Sincerity. అవి ఈశ్వరుడికి మారు పేర్లు. గుడంలేని ఈశ్వరుడు, గుడాల పుట్టలయిన మన మనసుల్లో ఆ గుడాల కింద ప్రతిఫలిస్తారు.

ఈశ్వరుడు అబద్ధమైనా, నా courage of conviction, love of truthని నువ్వు శంకిస్తే, నేనేం మిగలను. కాలానికిలొంగి భయపడి, భ్రమపడేవాడు ఎవరికీ ఆకర్షణ నివ్వడు, పూర్వం ఎన్ని ఘనకార్యాలు చెయ్యనీ, ఎంత రాయనీ. పోతారు - అతని పుస్తకాలు చదువుకుంటారు. ఈనాడు నువ్వే కాదు, ఎంతమంది యువకులు నావేపు కాంతి కోసం చేతులు జాస్తున్నారో! ఎందుకు?

నువ్వు రాసిన నీలో మార్పు మంచిదే. కాని అట్లా ఎప్పుడూ స్థిరపడిపోకూడదు.

ఇంత కొత్తది నేర్చుకోకుండా, మనకి అంతా తెలుసులే, అనే స్థిరత్వం, బద్ధకం, అహంభావం మనసుకి రాకూడదు.

నేను అక్కడికి వొస్తానని రాశానా? రాసి వుండనే! నేను ఇక్కడ ఓ M.A. క్లాసులో వున్నాను. Research చేస్తున్నాను. నన్ను ఒక్క రోజు బైటికి వొదలరు - అందులో అందమైన ఆడపిల్లల దగ్గిరికి.

పాపం, నిన్ను disappoint చేస్తున్నానా?

ఇంత కాలాన్నిటికి నీకు ఉత్తరం రాస్తున్నానంటే, నువ్వు తెలుసుకో వొచ్చు నిన్ను విలువగా చూసుకుంటున్నానో లేదో! ఏం లేదే!

నువ్వు నీ ideas స్థిరపడ్డాయంటున్నావా? అనుకుంటున్నావా? అది సర్వ అబద్ధం. అట్లా స్థిరపడ్డవాళ్లు చలాన్ని తెలుసుకోరు - వొంటరిగా కారణం లేకుండా యూడవరు. అట్లా ఏడ్చే వాళ్లలో ఎంతో నిత్య నూతన జీవనం చిగురుస్తోందన్నమాట.

Browningతో పాటు
Grow old with me -
Things are yet due
(quotation సరిగా లేదు)
అని అనరు, చలాని మళ్లీ.
నువ్వేం రాసినా విలువగా తీసుకుని ఆలోచిస్తాను. తేలిక చెయ్యను.



# VII

"చలం తిరుగుబాటు తత్వాన్ని వాళ్ల కుటుంబంలో మొదట గుర్తించిన సందర్భం అతని చెల్లెలి పెళ్లి జరిగినప్పుడు" - (ఆర్.ఎస్.సుదర్శనం)

ఆ చెల్లెలికే మనుమరాలిని నేను. వెంకటరమణమ్మ ఆవిడ పేరు. దుళ్ల పట్టాభిరామయ్య గారి భార్య. తొమ్మిదవ యేట కాబోలు - అంటే 1909లో ఆమె వివాహం జరిగింది. జమీందారీ ఫాయాలో వున్న కొమ్మూరి వారి కుటుంబానికి, బందరు దుళ్ల నారాయణప్ప గారి కొడుకు పట్టాభిరామయ్యకీ (19 సంవత్సరాలు ఆయనకి) ఏవిధంగానూ ఆర్థికంగా, సాంఘికంగా, నాగరికత విషయాల్లో సరిపోల్చడానికి వీలులేదు. మా ముత్తాత కొమ్మూరి సాంబశివరావుగారి బాధ్యతా రాహిత్యానికి, ఆడపిల్ల పెళ్లి విషయం ఎంత అలవోకగా తీసుకున్నారనేదానికి యిదొక నిదర్శనం. బందరులో నోబెలు కాలేజి హైస్కూలుకి కాబోలు యీయన వెళ్లి, 'తెలివిగల కుర్రాణ్ణి' చూపించమని అడిగితే, మా తాతను చూపించారని చెప్పేది మా అమ్మమ్మ. సంబంధం ఏకంగా నిశ్చయం చేసుకుని వెళ్లాక, ఆరోజో, మరునాడో ముత్తమ్మమ్మ వెంకటసుబ్బమ్మ గారు అడిగిందట. 'పెళ్లికొడుకు ఎల్లా వున్నాడు" అని.

'బాగానే వున్నాడు. మన వంట హనుమయ్యలా వుంటాడు' అన్నారుట యీయన. ఆవిడ లబోమని మొత్తుకున్నా ఫలితం లేకపోయింది. మా తాతయ్యది

'పెళ్లికొడుకు ఎల్లా వున్నాడు?'.
'బాగానే వున్నాడు. మన వంట హనుమయ్యలా వుంటాడు'

అనాదు - ముచ్చటమురి. చెవులకు అంటుకోళ్లు, గోధుమ రంగులో పొట్టి ఆకారం. మా అమ్మమ్మ, చలం గారి వలెనే పచ్చని పసిమి. అందమైన

కళ్ళు, పలువరస.

సరే, అయిదు రోజుల పెళ్లి ఘనంగా జరిగింది. మదరాసు నుంచి మెయిల్లో ఐస్లీలు, మల్లెపూలు వచ్చేవని చెప్పేది మా అమ్మమ్మ. ఇంట్లో ఆడువారు విప్పి పడేసిన బెనారెసు చీరెలు మడిచి పెట్టడానికి ముగ్గురు దాశళ్ళుండేవారుట. పెళ్లిలో వసంతాలు ఆడించారు, వధూవరులని ఎత్తుకుని అని చెప్పేది. ఈమె కాపురానికి వెళ్లేముందు ఇనుప బీరువా తెరిచి, 'నీకు కావలసిన నగలు తీసుకో' అని దివాన్ బహద్దూర్ వెంకటరామయ్య గారు, ఆమె తాతగారు అడిగితే, సున్నితమైన ఒకముత్యాల పేరు తీసుకొందిట. పొడుగాటి జడకి చివర కుప్పెలు వేస్తే, అవి కూర్చుంటే గుచ్చుకుంటాయని పూలజడలు కూడా వద్దనే సుకుమారి ఆమె.

తల్లికి ఎన్నో కానుపులు. ఎప్పుడూ ఆమె చూలింత, బాలెంత. ఆమె తల్లిదండ్రులకు ఒక్కతే కూతురు. భర్త యిల్లరికం. కూతురిమీద ప్రేమతో, గదిలో వెండిగిన్నెల్లో, చెక్కుతీసిన చెరకు ముక్కలు, మామిడి ముక్కలు వేసి, సున్నితంగా తినబెడుతోంటే, పిల్లలందరూ, సావిట్లోని అరటి గెలలు కొట్టుకుని తినేవారుట. వారందరిలోనూ పెద్దవాడు చలం. కొబ్బరి పుల్లల విల్లంబులతో, కర్ర కత్తులతో నాటకాలాడించే నాయకుడు.

సిరిసంపదలలో, స్వేచ్ఛగా గడిపిన యీ జీవితం నుంచి మా అమ్మమ్మ బందరు యిరుకు, చెక్కమేడ యింట్లోకి కాపురం వెళ్లింది. మామగారు, ఆయన రెండో భార్య వెంకాయమ్మ (భద్రమ్మగారు), సవతి కూతురు, తల్లికంటే నాలుగేళ్ల పెద్దామె వల్లూరి సీతమ్మగారు. వారికి మడి, ఆచారం, సామాన్యమైన రాబడి. అన్నంమెతుకు తాకిన చేతితో తల జుట్టు ముడివేసుకుంటే, బావి దగ్గర చేదలతో చన్నీరు తోడి నెత్తిన పోసే మడి. వాకిట వుంటే ముట్టుగదిలో పడేసి, గొట్టంలోంచి మంచినీళ్లు కూడా పోసే పరిస్థితి.

ఆయన వెంటనే ఆ మొగుణ్ణి వదిలేసి, మదరాసు వచ్చేయమనీ, నర్సు ట్రైనింగు చదివిస్తాననీ రాశాడు. ఆమె నిజంగానే వెళ్లిపోవాలని నిశ్చయం చేసుకుంది.

ఇవన్నీ ఆమె తట్టుకోలేకపోయింది. అన్నయ్యకి రాసుకుందో ఏమోగానీ, ఆయన వెంటనే ఆ మొగుణ్ణి వదిలేసి, మదరాసు వచ్చేయమనీ, నర్సు ట్రైనింగు చదివిస్తాననీ రాశాడు. ఆమె నిజంగానే వెళ్లిపోవాలని నిశ్చయం చేసుకుంది. తన వదినగారు 'ఒయ్యిలో', భార్యకో చదువు చెప్పించినట్లే, చెల్లెల్ని ఆ సంసార కూపంలోంచి బయటపడేద్దామనుకున్నారు. ఈ సమయంలో తల్లి వెంకట సుబ్బమ్మ యీ సంగతి గ్రహించి, బందరు వెళ్లి



'నీ తర్వాత ముగ్గురు ఆడపిల్లలున్నారు - నువ్వు కాపురం వదిలేస్తే, వాళ్లకి పెళ్లిళ్లవ్వవు. కదిలితే నా మీద వట్టే' అని చేతిలో చేయి వేయించుకుందిట.

ఈ సంగతి గ్రహించిన మా తాతగారు, భార్యలో కలిగిన అసంతృప్తి, భయం, తిరుగుబాటు మనస్తత్వం గుర్తించి, ఆమెకి చదువు చెప్పటం ఆరంభించారు. రాత్రిళ్లు అందరూ నిద్రపోయాక, ఆముదం దీపం వెలిగించి, ఒక్కోసారి దుప్పటీ ముసుగుపెట్టుకొని, చదువు చెప్పేవారు. ఆమె షేక్స్పియర్ నాటకాలను కూడా చదివేంత ఇంగ్లీషు పరిజ్ఞానం సంపాదించింది. ఆణిముత్యాల్లాంటి తన అయిదుగురు బిడ్డలను గొప్ప విద్యావంతులుగా, లలితకళామూర్తులుగా, ఆదర్శమైన వ్యక్తులుగా తీర్చిదిద్దింది.

తాతగారితో బాటు తనూ గాంధేయవాదిగా ఖద్దరు కట్టి, మహాత్మాగాంధీని దర్శించి, స్వయంగా తన హస్తాలతో విరాళాలు అందించింది. ఆమె పాడేది, కోలాటాలు వేసేది, బుర్రకథలు చెప్పేది. నాటకాల్లో వేషాలు వేసేది. నూలువడికి, బట్టలు నేయించి కట్టుకునేది, దానం చేసేది. 1939లో మహిళా సేవా మండలి స్థాపించి ఒక మహా సంస్థగా అభివృద్ధి చేసి, మహిళల ఆర్థిక, సాంస్కృతిక ప్రగతికి ఎంతో తోడ్పడింది. 'స్వతంత్రోద్యమంలో తెలుగు మహిళలు' పుస్తకంలో ఆమె పేరు చోటుచేసుకుంది.

నాకంటే 36 ఏళ్లు మాత్రమే పెద్దది కనుక, ఓపికతో ఎంతో బాగా పెంచింది. విలువలు, మర్యాదలు, ప్రవర్తన కట్టుబాట్లు అన్నీ తన బిడ్డలకు నేర్పించింది. 88 ఏళ్ల వయస్సులో ఆమె కన్ను మూసినప్పుడు ఎందరో స్త్రీలు తమ ప్రియబాంధవి పోయినట్లు బాధపడ్డారు. సార్థకమైన సంపూర్ణ జీవితం.

"అమ్మణ్ణి చలం తన కాపురం చెడగొట్టే ప్రయత్నం చేసినట్లు నిందలు వేసిందట" అని చలం జీవిత విశేషాలలో వ్రాస్తే, నాకివన్నీ గుర్తుకొచ్చాయి.

హాస్యప్రియత్వం, మానవత్వం, సానుభూతి, స్వధర్మం, కళాహృదయం మూర్తీభవించిన ఆ 'సాధ్వి' 'నిందలు' వేసిన సందర్భం యిందులో ఎక్కడ వుంది? ఆమె రోజులు బాగుండబట్టి చలంతో కలిసి జీవితం పంచుకున్న 'చరిత్రహీన' కాలేదామె. అల్లా జరిగి వుంటే నా ఉనికి, నా చరిత్ర వుండేది కాదు అని కూడా నా మనవి. నా బిడ్డలిద్దరూ పుట్టినప్పుడు హైదరాబాదులో నీలోఫర్ ఆస్పత్రికి రిక్షాలో వచ్చి, నాకు 'ఆరాంగా' పథ్యం పెట్టాలని ఆరాటపడిన ఆమె పరిపూర్ణమైన మాతృమూర్తి.

"అమ్మణ్ణి చలం తన కాపురం చెడగొట్టే ప్రయత్నం చేసినట్లు నిందలు వేసిందట" ఆ 'సాధ్వి' 'నిందలు' వేసిన సందర్భం యిందులో ఎక్కడ వుంది?

బందరుకి బెజవాడ ఎంత దూరం! అందుకే కబుర్లు తెలిసేవి. ఒకసారి కృష్ణపుష్కరాలకి వెళ్లి అన్నయ్యను చూద్దామని ఆయనింటికి వెడితే, 'నువ్వెందుకు వచ్చావు' అన్నాడట ఆయన. పంతం, పౌరుషం వచ్చి చివరి వరకు ఆయన ముఖం చూడలేదామె.

ఒకసారి 1946లో కాబోలు, ఆయన బందరు వచ్చారు తల్లి వెంకట సుబ్బమ్మగారిని చూడడానికి. ఆ గది, మంచం, ఆయన ఒక కుర్చీపీట మీద కూచోడం నాకు బాగా గుర్తు. ఆయన మరో చెల్లెలు కాదంబరి జానకీబాయి కూడా అక్కడ వున్నది. 'అన్నయ్యా, మనకి అమ్మని చూడాలని వుండకపోయినా, 'అమ్మకి మనల్ని చూడాలని వుంటుంది కదరా!' అన్నదామె. నేను ఆ స్వరం, ఆమె అన్న ఆ పద్ధతి మరువలేను. అంటే తల్లి విషయంలో ఆర్థికమైనదే కాక, మరేరకంగాను బాధ్యత వహించలేకపోయినాడాయన. అంతటి ఐశ్వర్యవంతురాలు తన చివరి కుమారుడు లలిత వరప్రసాదరావు దగ్గర, యీపూరి గోపాలమహలులో కన్నుమూసింది. ఒక చిరుతిండికి, మంచి బట్టకు కరువైన పేద స్థితిలో. ఆమె అల్లుడు కాదంబరి వెంకటచలం (బ్రూక్‌బాండ్ డైరెక్టరు కె.వి.చలం) డబ్బు పంపేవారని చెప్పుకునేవారు.

తల్లిని పోషించని మనిషిగా నేను చలాన్ని పేర్కొనడం భావ్యంకాదు. తన భార్యని పిల్లలతో ఎగతాళి చేయించి, కొట్టించిన 'వికృత వ్యక్తిత్వం'గా ఆయన్ని పేర్కొనడమూ భావ్యం కాకపోవచ్చును. యుక్త వయస్సులైన ఏకైక కుమారుడు, ఆనాటి బెజవాడ వంటి తెలుగు సమాజంలో యిమడలేక, యిల్లు విడిచి అంతర్థానమైపోవడానికి ఆయనే కారకుడని కోపంగా అనడమూ సబబుకాకపోవచ్చును.

ఆయన భార్య రంగనాయకమ్మ (రంగమాలతి) సోమవారం నాడు మౌనంలో వుండేది. తిరువణ్ణామలైలోని యింట్లో నున్నని గచ్చుమీద తను చెప్పదలచుకొన్నవన్నీ చాక్‌పీస్‌తో రాసేది. చలం గోడకు జారగిలబడి కూచుని వుండగా, ఆమె ఆయన వంక చూస్తూ, 'ఇదంతా యీ వినాయకుడి వల్లే' అని రాసింది. నేను ప్రశ్నార్థకంగా చూస్తే ఆయన బొజ్జవేపు చూపింది. నుదుటిమీద వేలితో కొట్టుకుంది, రాత అన్నట్టు. కొడుకు లేకుండా పోవడంతో పాటు, చివరి పిల్ల, యితర మతస్తుణ్ణి పెళ్లి చేసుకుందని ఎంతో కుంగిపోయిందన్నమాట.

'అన్నయ్యా, మనకి అమ్మని చూడాలని వుండకపోయినా, అమ్మకి మనల్ని చూడాలని వుంటుంది కదరా!' అన్నదామె.

1962లో – మదరాసులో ఆంధ్ర మహిళా సభ రజతోత్సవం జరిగింది. రచయిత్రులందరినీ పిలిచారు. వారిలో నేనున్నాను. సంఘ సేవకులను



పిలిచారు. వారిలో మా అమ్మమ్మ వున్నారు. అమ్మమ్మతో బాటు తాతయ్య వచ్చారు. నాతోబాటు మావారూ వచ్చారు. మదరాసులో ఉత్సవాలు పూర్తయినాక మా తాతయ్యగారు తిరువణ్ణామలై బయలుదేరారు. అమ్మమ్మ తనని అవమానించిన అన్నయ్యను చూడను పొమ్మన్నది.

71 ఏళ్ల వయస్సులో మా తాతయ్య ఎండనబడి, బస్సులో చలాన్ని చూద్దానికి వెళ్లారు. మర్నాటికి కాబోలు తిరిగి వచ్చారు. ఆయనకి ఏ సంగతి అయినా 'నెరేషన్' రక్తిగట్టేట్లు చెప్పడం అలవాటు. అందుకు తను బస్సు ఎక్కిన క్షణం నుంచి, అక్కడికి చేరడం, చలం బంగళా వున్నచోట వెతుక్కుంటూ వెళ్లడం చెప్పారు. ఎవరు?' అన్నాడుట చలం. 'నేను, పట్టాభిరామయ్యను' అన్నారుట యీయన. 'ఏ పట్టాభిరామయ్యా?' అన్నాడుట ఆయన. 'మీ బావను' అన్నారుట యీయన. చలం ఆశ్రమం, భజనలు, ప్రార్థనలు అన్నీ చూశారీయన. చూసి, ఆ మార్పుకి ఇంప్రెస్ అయినారు. 'అబ్బా, ఎంత మారిపోయాడో!' అని విస్తుపోయారు. తృప్తిచెందారు. ఇదంతా సరే – చలం అన్నారుట "నువ్వే గెలిచావు, నేనే ఓడాను" అని. బిడ్డలని కనిపెంచడంలో, చదువులు చెప్పించడంలో, పెళ్లిళ్లు చేయడంలో – క్రమశిక్షణతో పెంచడంలో, తండ్రిగా బాధ్యత నెరవేర్చడంలో – అనేంత భావం వచ్చేమాట అది. మా తాతయ్య కూడా చలించిపోయారు ఆ మాట విని. చలం నిజాయితీ అది. ఓడిపోయానని ఒప్పుకునే ధైర్యం అది. ఆనాడు నేను రాసిందీ, చేసిందీ రైటే – అని నాతో అయితే ఉత్తరాలలో 45 ఏళ్లనాడు వాదించగలిగారు గానీ – ఋజువర్తన, క్రియాశీలత, ఆర్థిక నిబద్ధత, భగవద్గీతానుసరణలో జీవితం గడిపిన మా తాతయ్యను బుకాయించలేకపోయినారు. అదీ ఆయన నిబ్బరానికి, సత్యానికీ దృష్టాంతము.

[illegible]

నీ ఉత్తరం. ఈ లోపలే నేనో చిన్న కార్డు రాశాను. హైద్రాబాదు వెళ్లి వుంటుంది.

ఇప్పుడు మాత్రం పెద్ద ఉత్తరాలు రాయకేం? అప్పుడప్పుడు ఆ పని అవసరమౌతోనే వుంటుంది. కాని నీకు పెద్ద ఉత్తరాలు నేను రాయవలసిన అవసరం పడుతుందనుకోను. ఆ రోజుల్లో జీవితమే ఒక పెద్ద ప్రశ్న నీకు. అంటే నీలోపల ఘోషపెట్టే ఓ సముద్రం వుండేది. అరుణాచలం వొచ్చే వరకు నాలో ఉన్నట్లే. కాని కాలమూ, జీవితమూ, ఉద్యోగమూ, పెళ్లీ, ఆ సముద్రాన్ని, శాంతంగా ఆకాశం వేపు చూసి కలలు కనే సరస్సుగా మార్చినట్లుగా వున్నాయి. మళ్లీ అలలు నీలో లేచేవరకు చలం ఉత్తరాల అవసరం చాలా స్వల్పం. నీలో తిరిగి తుపాను రేగకుండా చూసుకునే సామర్థ్యం నీ భర్తలో వుందని నా విశ్వాసం.

నేనెప్పుడూ రాస్తాను జ్ఞాపకం వుందా. మనిషికి రెండు గండాలని పెళ్లీ ఉద్యోగమూనని వాటినించి మనిషిని రక్షించగలిగింది, భగవాన్, మృత్యువూ.



నీ విషయంపై పెళ్లి భయం లేదు. కాని నీ ఉద్యోగంపై నాకు అనుమానం.

ఇక్కడా ఏమీ జరగవు. ఓ పెద్ద హార్మోనియం అమ్మకానికి వొచ్చింది. అదే event... ఈ ఇల్లు గుమ్మం దాటితే, మాకెవరితోనూ సంబంధంలేదు, ఉత్తరాల ద్వారా తప్ప.

'ప్రవీణ్' సంగతా – ఆయన నాకు బావున్నారే! అంతకన్న రాయడానికి ఆయన్ని నేనే మెరుగుదును! ఏమైనా, మనిద్దరం కలిసి ఏళ్ల కింద ఏరుకున్న మొగుడేకదా!

ఇక్కడికి వొచ్చి చూసి కూడా, రాని వాళ్లు పడే పొరపాటే పడుతున్నావా? నీ సంగతులు ఏమి మాట్లాడినారా అనా, నాకేం వినుగులేదు. రష్యా అమెరికాపైన H.Bomb వేసిందని వింటే, 'అట్లాగా' అంటాను. కాని బేబీ కడుపుతోందని తెలిస్తే, పాపం చిన్న baby అంత పెద్ద పొట్టని ఎట్లా మొయ్యగలుగుతుంది? అని వ్యాకులపడతాను. నీ జీవితంలో నీకు ఏది రాయడం అవసరమని తోస్తే అది రాయి. నీలో మిత్రుడున్నాడు ఇక్కడ. నీ చెయ్యి ఇటుజాచి ఉన్నంత కాలం, చేతిని విడవని మిత్రుడు. తరవాత నా దృష్టి, నేను ప్రేమించే వారివేపు, నన్ను ప్రేమించే వారివేపు, direct కాకపోతే, అంతకన్న ఏం చేస్తుంది? ఎందుకంటే, నాకిక్కడ ఇక్కడ, నావేపు ఆశతో చూసే బేబీ, నావేపు చెయ్యిజాచే బీద అమ్మాయి, తెల్లారే నా మొహంలోకి నవ్వే బంతిపువ్వు, – అంతకన్న దూరంగా, పూర్వ ద్వేషంతో నన్ను తిట్టే అప్పలూ, వీరందరి కళ్లల్లో ఈశ్వరుణ్ణి చూడగలగాలనే యత్నమే. ఏనాటికన్నా జ్ఞాపకం వుంచుకో – తపస్సు అంటే దీన్నంతా త్యజించి ఈశ్వరిడి కోసం పోవడంకాదు, దీన్నంతా ఈశ్వరుడిగా చూడగలగడం – యువ్వనవతి, సౌందర్యవతి ఉత్సాహవతి ఐన బేబీనే కాదు. ముఖ్యం ఆ కళ్ల వెనక తొంగిచూసే అసలు 'నేను' అనే ఆ బేబీని చూడాలని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

5/9/

[illegible]

నీ ఉత్తరం.

లాభం లేదు. బేబీ, లాభం లేదు. నువ్వూ నేనూ, చెరో వేపుకీ దూరంగా పయనించాము. ఎంత చూచినా మన వేళ్ళ కొనలుకూడా తాకవు. అందువల్లనే నా ఉత్తరం నీకంత దూరంగా కనపడుతోంది. నన్నేమో నువ్వు లోకానికి సంబంధం లేకండా కొండలో దూరిపోయినానంటావు. నేనేమో నిన్ను లోక కల్మషంలో, మర్యాదలో ఇంకిపోతున్నావంటాను. ఎక్కడ అందుతుంది లంగరు?...

నీ దస్తూరి తెలీటంలేదు. Blue Paper పైన blue Ink. కళ్ళకి strain. అయినా చివరికి అర్థమైనా బావుండును. నీ పెళ్లి సంగతి - మీ పెద్దలు వున్నారే- తాతలూ, తండ్రులూ- తల్లులూ- వారు ప్రతిష్ఠపరులు - ఉద్యోగాలు, పెళ్లిళ్లు, ప్రతిష్ఠలు - గొప్పలు - వీటి ఆరాధకులు. నువ్వు వలచిన అబ్బాయి వారి మన్ననకు తగివుండలేదు ఏ కారణానో! వాళ్ల అనుమతి నీకు ఎన్నడూ రాదు. నువ్వు M.A. అయినా సరే, M.H.N.D.X.L.B. - అయినా సరే.

ఈ వేషాలన్నీ బాగా ఎరుగుదును. కోపం - పొమ్మనడం - సాగకపోతే - కన్నీళ్లు - వాపుకొన్నట్లు లొంగడం - వెనక గోతులు తియ్యడం - కుట్ర - వడకంగా చెయ్యడం - అంతా నీ మంచి కోసమేనని మోసపుచ్చుకోడం - నిన్ను మోసపుచ్చడం - గడువు పెట్టడం - ఈ లోపల చెయ్యవలసింది చెయ్యడం - చాలా జగర్తగా వుండు.

నీ బతుకునే నాశనం చేస్తారు. వాళ్ల కొలతలన్నీ డబ్బు కొలతలు. M.A. చదివించినందుకు, నువ్వు పెళ్లి మానుకోవాలా!

నమ్మకు. వాళ్లలో ఒక్కరిని నమ్మకు. ఒకరు కోప్పడితే, ఇంకోరు బుజ్జగించినట్టు నటించి, నిన్ను బంధిస్తారు.

అదంతా ప్రేమ అంటారు. నీ క్షేమమంటారు.

మార్పులేదు ఏం లేదు. ఈ ఉత్తరం అందగానే పెళ్లి చేసుకో.

ఇక్కడికి రండి.

ఇక్కడ ఈశ్వర సమక్షంలో పెళ్లి జరుగుతుంది.

పెళ్లి అయిందా, ఇంక అందరూ నిన్నూ అతన్నీ తమలో చేర్చుకుని, మిమ్మల్ని మర్యాదస్తుల్ని చేసుకుని, ధనకీర్తి దేవతలికి నిత్యపూజలు చేయిస్తారు.

తమ కూతుళ్ల కొడుకుల వల్లనే గాక, నీ పెళ్లి వల్ల కూడా ఘనతకెక్కాలని వాళ్ల ఆశయం - జాగర్త, చాలా జాగర్త.

"మేమంతా వున్నాం నీకు" అన్నవాళ్లు నీకు పెళ్లి చేయలేదేం?

కుట్ర - అందరూ వొకటే.

"ఎందుకు? నీమీద ఆశలు!" ఏం చెయ్యాలి నువ్వు మీ నాన్నగారికి! పెళ్లి చేసుకోకండా, సంపాయించిపెట్టాలా! లేక ఏ రాజకీయ నాయకుణ్నో పెళ్లిచేసుకోవాలా? మామని పోషించే అల్లుణ్ణి తేవాలా, ఏమిటా ఆశలు నీమీద!

పెళ్లి చేసుకున్న వాళ్లని M.A. పరీక్షకి రానీరా?

మీరు కలుసుకోకూడదని, ఎవరన్నా షరతు పెట్టారా?

ఇక్కడికి రాలేవు. నిన్ను రానీరు. నిన్ను M.A. pass కానీరు. అయినా ఇంకో అటంకం తీసుకొస్తారు. నా మాట విని పెళ్లి చేసుకో వెంటనే. పెళ్లి చేసుకోకపోయినా, అతనితో వేరే కాపరం పెట్టు.

ముందా ఇంట్లోంచి బైటపడు.

అది ఆత్మకి మృత్యుగృహం. నిన్ను చూస్తే నాకెంతో దిగులు వేస్తోంది.
నువ్వు నాకు ఉత్తరాలు రాస్తున్నా, ఆపేస్తారు. జాగ్రత్త. Postman నించి నువ్వే తీసుకో ఉత్తరాలు.

నీ మంచి కోసమని పేరుపెట్టి వాళ్ళు చెయ్యని ఘోరం వుండదు.

నీ పిల్లల్ని నాకు చూపుతావా? నన్ను చూడడానికి నీకు దిక్కులేదు కదా! నీ పిల్లలకి వుంటుందా? అప్పటికి నువ్వెంత మర్యాదస్తురాలివి అవుతావో! నీకు వాళ్ళు కట్టిపెట్టే భర్త నిన్నిటు రానీడు. అతన్ని ముందే warn చేసి వుంచుతారు.

పోయినసారి నువ్వు ఇక్కడికి వొచ్చినప్పుడు తెరవెనక మీ కుటుంబాలలో ఎంత రొద రేగిందో నీకు తెలుసా?

నాకు 'పుట్టిన పండగ' అనే మాట వింటేనే కక్కు

నీకూ నాకూ ఎక్కడ అందుతుందిరా! అచ్చయిన కథలు వుంటే పంపు. చదువుతాను.

నీకూ నాకూ వయసు భేదం, సమభేదం కాదు. మన ideologiesలో భేదం. ముఖ్యమైన భేదం.

ఈ చలం వేరురా బాబూ –

చాలా త్వరలో, నా రాతలు పిచ్చిరాతలంటావు. తరవాత "బాగానే రాస్తాడుకాని – అతని శైలి గొప్పది – కాని – అని పెదిమ విరుస్తావు.

అవును, బాబూ, నేను చెప్పేది అంతే. మనుషులు, పరిస్థితులు, నీలోని రక్తం, నిన్ను కట్టేస్తాయి. రాలేవు.

ఇంకా బురదలో ఇంకిపోకు. అతనికి jealousy వుందా! మరి వుండదా? ఆ మాత్రం లేకపోతే, ప్రేమనిలుస్తుందా? దాన్ని జయించిన వియోగులలో తప్ప!

చలాన్ని చూస్తే జెలసీ వుండడం, ద్వేషం లేకపోవడం అతనికీ, చలానికీ కూడా గొప్ప compliments.

ఇక్కడ అట్లాగే ఉన్నాము. పెద్దత్తయ్య హైద్రాబాదు వొచ్చింది.
నీ పై దిగులుతో
చలం.



[illegible]

తాతయ్యా, గీతయ్యా, పాతయ్యా, రోతయ్యా ఇట్లాంటి మాటలు మానెయ్యి. Famous letters of a Famous story writer to his famous story - writrix grand-daughter అని మన correspondence పదిహేను భాషల్లో ప్రచురణమైనప్పుడు, ఈ తాతయ్యలు చూసి ఏమనుకుంటారు?

నాకు బంధువులూ, బంధుత్వపు పిలుపులూ, సంభోధనలూ, శుభలేఖలూ, అన్నీ పరమ రోత అని గట్టిగా ఈ అణ్వస్త్ర కాయితంమీద record చేసి, నీ మనసులో register చేస్తున్నాను.

నీ కథలు study చేస్తున్నాను. నిన్ననే చెప్పింది సత్తకి, నువ్వు పొట్టి పిచికమల్లే రెండు కథల్ని ఇక్కడ వొదిలి వెళ్లావని.

నేను కదలకండా వాళ్ళు ఇక్కడికే వొస్తున్నారు. గనక, సన్మానం చేయించుకోమన్నారు ఈశ్వరుడు. పాపం బీదవాళ్ళు, ఆశ్రమవాసులు. ఎక్కడెక్కడో దూరాలనించి వొచ్చి, నన్ను గౌరవిస్తానంటే, వాళ్లని నిరాకరించలేకపోయినాను. అయినా వాళ్లలో ఎవరూ నేను రాసింది ఏమీ చదవలేదు. ఇది సారస్వత సన్మానం కాదు, యోగసన్మానం. అదినాకిష్టంలేదు. వాళ్లని చూస్తే నాకు వాళ్లకి సన్మానం చెయ్యాలనిపించింది.

హైద్రాబాదు వాళ్లెందుకు! ఈసారి 1977లో నువ్వు ఇక్కడి వొస్తేనే, అప్పుడు వొస్తే, ఈ పూళ్లో జాజిపువ్వులదండ ఒకటికొని తీసుకురా. మనిద్దరం సన్మానం జరుపుకుని

'Baby's సన్మానం to a tottering బేబీ అని పత్రికల్లో వేయిద్దాము.

ఆ దండతో పాటు ఒక soother కూడా కొనుక్కురా బహుమానంగా.

చిత్రని చూసి మళ్లీ రాస్తానన్నావుగా! అప్పుడు మళ్లీ రాస్తాను తక్కిన

విషయాలు. అప్పుడు జీసస్ చరిత్ర కూడా పంపుదుగాని, ఇప్పటినించీ type చేస్తోవుందు.

దాలీ తిరిగి బడికి వెళ్లనంది. ఇక్కడే వుంది. వజీర్ రహ్మాన్ ఇక్కడే ఉన్నారు. నాలుగు దిక్కులకీ, దాబా మీదినించి, గాలిలో దరఖాస్తులు పంపుతున్నారు, ఉద్యోగాలకి.

పద్మావతి పిచ్చికి జబ్బుగా వుంది. అందువల్ల మాకు దోసకాయలూ, దొండకాయలూ రాలేదు. చిత్ర ఎప్పుడు తెస్తుందో కనుక్కో

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

... నీ కార్డు, సరే పూర్తికానీ typing అన్నీ ఓసారే పంపిద్దుగాని.

చిత్రా పిల్లలూ ఇక్కడే ఉన్నారు. నేను పెద్ద ఉత్తరమా? ఇక్కడ ఏం విశేషాలు వుంటాయని రాశాను! ఈ గోడ దాటి అవతలికి పోనీ! ఎవరూ గోడదాటి ఈవూరి వాళ్లు లోపలికి రారే. ధర్మం పెట్టమని పెదిచ్చే దీనులు తప్ప!

ఉత్తరాలు కూడా ఎంతో తగ్గిపోయినాయి. వారానికి ఓ పది వేస్తాదేమో లేదు. పనిలేక కలానికి తుప్పు పట్టింది.

అయినా పూర్వం మల్లే ఎట్లా రాస్తాను! ఎన్ని గోడలు మనిద్దరి మధ్యా! పెళ్లి, అత్తమామలు, భర్తలు, ఆవిడ ఎవరు? ఆ... దుర్గాబాయమ్మగారు, శారదగారు, పని, పని, పని, నీకు! సరదాలు, మిత్రులు, పత్రికలు.

చలం

... నీ జీవితమూ, నీ భవిష్యత్తూ, నువ్వూ నాకంత దగ్గర కాకపోతే, నీకు ఈశ్వరుడి సంగతి ఇంత ఎందుకు రాస్తాను, ఎందుకు నువ్వు 'పాత నీతులనుకునేవి రాస్తాను? సనాతనంగా ఉంటున్నాడు గనక సూర్యుడు పనికిరాని వాడౌతాడా? వేడి తగ్గిందా? అట్లాగే కొన్ని నీతులు ప్రేమ, స్వార్థరాహిత్యం, కరుణ, సత్యాన్వేషణ - సూనృతం, నిష్కపటం, ఇట్లాంటివి మానవాభ్యుదయానికి - (బైట కాదు, లోపల) ముఖ్య సాధనాలు. వాటిల్లోంచే మానవుడు విశాలమౌతాడు. నీతో వాటి సంగతి మాట్లాడాను. రాశాను. నువ్వూ తెలుసుకుంటావు. ఈనాడు నమ్ము - ఈ మనసే మనకి దుఃఖహేతువు. సుఖహేతువుకూడా. ఇప్పటినించీ దాని విజృంభణ పైన ఆధారపడవొద్దన్నాను. అది సాధనమే. దాన్ని యెదిరించి బతకడానికి వీల్లేదు



ప్రస్తుతం నువ్వు. కాని it is an unavoidable evil అనేది తెలుసుకుంటావు క్రమంగా - ఈనాడో, వెయ్యేళ్లకో. 'శాంతి'. 'శాంతి' అంటే ఏమిటి? మనస్సు పొంగు ఆగడం, తగ్గడం. బాధ వొచ్చినప్పుడు మనస్సు ఎట్లా పొంగుతుందో గమనించు. పెద్ద సుఖము వొచ్చినప్పుడూ అంతే. అప్పుడు ఆ సుఖం బాధకి చాలా దగ్గర. ఇప్పుడు నీలో శాంతి నీ మనసు స్థిరం కావడం వల్ల.

మళ్లీ preach చేస్తున్నా, నా theories నీకు చెప్పడానికి కాదు. తెలుసుకుని సుఖపడతావని. ఇవి నా theories కాదు. సనాతనంగా యోగులు కనుక్కున్నవి. ఈ బోధన వెనక నా ప్రేమా నీమీది ఆదుర్దా గోచరించదా?

నేనీనాడు పాత మాటలు రాయలేనా, నీ మెప్పు పొందడానికి? నదుకు, తన్ను, తిరగబడే, చదువు, బాగా విచ్చలవిడిగా అనుభవించు, పైకి పాకు అని. రాయగలను. కాని రాయను. ఏనాడూ నా బోధ అది కాదు. Save your soul అనే.

... అప్పటి నీలో మార్పు నా పూర్వ సిద్ధాన్తానికి గాని, నీ పూర్వ సిద్ధాన్తానికి గాని విరుద్ధం కాదు. ఇదివరకటికన్న ఎక్కువైనదీ, ఇదివరకటిదాని sequel, దాని progressive projutre. ఎక్కువ తెలుసుకుని advance అయినామన్నమాట. నా పూర్వ సిద్ధాన్తమంటున్నావు. అనాటి సిద్ధాన్తం ఈనాడూ నాదే. నేనేం మారలేదే వాటి విషయమై! అవన్నీ సత్యమే. కాని ఇప్పుడు వాటిని మించిన సత్యాన్ని తెలుసుకున్నాను. A higher truth. దీనివల్ల readjustment జరగవొచ్చుగాని అది అబద్ధం కాదు. Einsten & theory of relativity వల్ల Newton అబద్ధం కాలేదు. ఆ plane of outlookలో అది సత్యమే. ఈ planeలో ఇది సత్యం.

ఈ ఉత్తరం నీకు కొంతైనా నచ్చుతుందని నా ఆశ.

నీకు ఇంత ఉత్తరం వ్రాయడమంటే సామాన్యం కాదు. నా కాలం అమూల్యం ఈనాడు ఎప్పటికన్న. దాంలో కొన్ని గంటలు ఇచ్చాను నీకు. దానివల్ల తెలుసుకోవొచ్చు, నీపైన నా శ్రద్ధ. నీపైన నా ప్రేమ. ఒక్కటి తెలుసుకో - ఈ ప్రేమల్లో, కావిలింతలూ, ముద్దులూ, తక్కినవీ తెలిపే ప్రేమ చాలా స్వల్పం. అవి చాలా అవసరం. *You cannot afford to miss them.* కాని వాటిల్లోంచి ప్రవహించేది ప్రేమవాహినిలోని తుంపర మాత్రమే.

ప్రేమతో పిచ్చి బేబీ.

నీ చెలం

# VIII

చలం తన తొలి జీవితాన్ని, రమణాశ్రమానికి వెళ్లని పూర్వం, ఎల్లా నడుపుకున్నాడో చలం భక్తులందరికీ తెలుసు. అవి గొప్ప ప్రణయ సాహసయాత్రలుగా చదువుకొని వుంటారు. ఎంతోమందికి తమ మనస్సుల్లో దాక్కొని, తోచిన మోహ, వాంఛా క్రియలలో పడిపోలేక, మింగేసి, చుట్టూ అబగా చూసే అలవాటూ వుండవచ్చును. అరె, చలం అంత సులువుగా ఎల్లా కళ్లు ఎటుపోతే అటు చూస్తూ, మనస్సు ఎటులాగితే అటు మళ్లిపోతూ, అందమైన పూవుమీద వాలిన భ్రమరంవలె సౌందర్యాన్ని జుర్రుకున్నాడని యీర్ష్యగానూ వుండవచ్చును. పదే పదే ఆయన వాంఛా పరిపక్వ గాథలను చదువుకొని వుండవచ్చును. తాము చేయలేనిదేదో ఆయన చేసేసినందుకు ఆరాధనలో పడిపోయి వుండవచ్చును. 'వైకేరియస్ ప్లెజర్' అనవచ్చు దీనిని. ఆయన బయటికి చెప్పుకొని, దేశమంతా టముకు వేశాడు. ఆయన చేసినది సామాన్యుల జీవితాలలో సాధ్యపడేది కాదు, సంభవమూ కాదు, సమర్థనీయమూ కాదు అని ఖండించే తెగింపు వారికి లేదు.

తాము చేయలేనిదేదో ఆయన చేసేసి నందుకు ఆరాధనలో పడిపోయి వుండవచ్చును.

ఒక సాయంకాలం పూట రంజింపచేసే రసనాటకంగా చలం గురించి మాట్లాడుకుంటే అది మన ఆధునికతకు నిశానిగా భావించే కుహనా భంగిమలు నాకు నచ్చవు.

ఒకే, చలం చెప్పినవన్నీ అనుకరించేంత భక్తి, గురి వున్నాయని బహిరంగంగా చెప్పుకునేవారు - పురుషులైతే తమ నిత్య జీవితంలో ఆచరణలో పెట్టేయగలరేమో! అనుకొన్నది ముఖాన అనడం, యితరులలో తమకి నచ్చనిది వెటకారం చేయడం, విద్యాలయాల్లో,



కార్యస్థానాలలో వ్యవస్థాపర క్రమశిక్షణను గెలిచేసేయవచ్చును. మరి తమ తల్లి, అక్క చెల్లెళ్లు, భార్య, తమకు సంబంధించిన యితర స్త్రీలు అల్లా చేస్తే సహించగలరా?

ఇదే ఆలోచనను కొంత సాగదీస్తే, చలం నిజాయితీ, మనసు చెప్పిన పోకడ, సౌందర్యారాధన, ముఖ్యంగా అలౌకికమైన స్త్రీ లావణ్య అభివర్ణన - వీటన్నిటినీ ఆయన అవకాశం దొరికినప్పుడు ఆచరించి వదిలేశాడు. అనుభవించి వదిలేశాడు. కానీ దానిని బాధ్యత లేని ప్రేమగా, అతి క్షణికమైన ఉద్రేక ప్రవర్తనగా నేను భావిస్తాను. ఒక స్త్రీ వ్యభిచారం చేస్తున్నదంటే ఆమెమీద జాలిపడతాను. తన ఆత్మగౌరవాన్ని అణచివేసుకుని, సర్వ ప్రాణి ధర్మమైన ఆహార, నిద్ర, మైథునాలలో చివరి దానికి, పడానికి లొంగిపోయిందంటే ఆ పురుషుని క్రూరత్వాన్ని నేను ద్వేషిస్తాను. మనిషిగా ఆమెలో నిటారుగా నెలకొన్న ధ్వజస్తంభం లాంటి ఆత్మని చంపేసినందుకు, కుసుమ సదృశమైన మనస్సుని కాలరాచినందుకు, చిగురుటాకు వంటి ఆ శరీరాన్ని మలినం చేసి నలిపి నాశనం చేసినందుకు నేను అతడిని శపిస్తాను. తమకీ మనస్సు, ఆత్మ వున్నాయని, అవి కాముకత, వ్యాపారం అనే అగ్నిలో బూడిదైపోయాయని గుర్తించకుండానే 'వ్యక్తులు'గా చచ్చిపోయిన యువతులను గురించి విని, లోకంలో ఎంత హింస వుందని విలవిలలాడుతాను.

ఇటువంటి సందర్భంలో, చలం చేష్టలు ఏ కోణంలో సమర్థిస్తాను? డబ్బు కోసం కాకపోతే, 'ప్రేమ' కోసం లొంగిన వారిని నేను ఏ పేరుతో పిలవాలి? నా ఆమోదం, నా న్యాయ నిర్ణాయకత్వం ఆయనకు అవసరం లేదు. అసందర్భము కూడాను. కానీ, యిలాంటి ప్రశ్నలు వేయకుండా, సమాధానాల కోసం అన్వేషించకుండా - 'జైజై చలం' అని జేకొట్టే వారి కృత్రిమత్వాన్ని, చిత్తశుద్ధిని శంకిస్తాను. నా తగాదా వారితోనే. నేను విరుచుకు పడేది వారి రెండు ముఖాల, పార్శ్వాల, పాక్షిక విలువల వ్యక్తిత్వం, ప్రచారాలతోనే.

ప్రశ్నలు వేయకుండా, సమాధానాల కోసం అన్వేషించకుండా - 'జైజై చలం' అని జేకొట్టే వారి కృత్రి మత్వాన్ని, చిత్తశుద్ధిని శంకిస్తాను.

చలాన్ని చదవడం ఫ్యాషను, చలంలాగ చంచలత్వం యింకా ఫ్యాషను. వ్యక్తి స్వేచ్ఛకు గొప్ప నిర్వచనం చలం. సౌందర్యోపాసనకు సుధామధుర వ్యాఖ్యానం చలం. అది సరేగానీ, ఆయనలాగ బ్రతికేస్తామనీ, తమ కుటుంబ స్త్రీలను బతకనిస్తామని,

ప్రోత్సహిస్తామనీ ఎందుకు వేదికమీద ఎవరూ చెప్పరు? చలం సంస్మరణ, అధ్యయన సభలకు తమ భార్యలను వెంటపెట్టుకొని వచ్చేవారు ఎంతమంది?

సౌరిస్, ఈశ్వరుడు, చలానికి సాక్షాత్కారం నాలాంటి హేతువాదికి (అంతకంటే చిన్నమాట ఛాలు నా విషయంలో) మానవతావాదికి అంతుపట్టని విషయాలు. సైకియాట్రిస్ట్ విశ్లేషించదగిన 'హెల్యూసినేషన్స్' అనిపిస్తుంది. అటువంటి పాత్రలో 'షౌ' యీనాడు భీమ్లీలో అతి ప్రశాంతతలో వున్నదంటే, నాన్న తనకిచ్చిన జీవితానికి హార్దిస్తున్నదంటే - నేను బాహ్యంగానైనా నమ్ముతాను. నర్తకి, చిత్ర తిరువణ్ణామలై ఎందుకు వెళ్ళిపోయారంటే ఎందుకు అని అడిగి, నాకు సమాధానం తెలిసినందున, అది మనస్సులోనే దాచుకుంటాను. ఛే (నిర్మల) బొంబాయిలో 1967 నవంబరులో మా అమ్మమ్మని, నన్ను కలిసినప్పుడు, 'అత్తయ్యా, నేను తిన్నాను. తిరిగాను, తాగాను - కానీ నాకు వాటిల్లో తృప్తిలేకపోయింది' అంటూ సందీపని సాధనాలయంలో స్వామి చిన్మయానంద దగ్గర స్టెనోగ్రాఫర్‌గా పనిచేస్తూ, శాంతి సంపాదించుకుంటున్నాను' అని చెప్పినప్పుడు, కథకురాలిగా, సంఘ సేవకురాలిగా కాశీరత్నం పువ్వులాంటి ఆ చిన్న ఆకారాన్ని చూసి - అంతకు ముునుపు ఆమె జీవితాన్ని గురించి పూహాచిత్రం మనస్సులో వేసుకొన్నాను. నిండా యిరవై ఏళ్ళు కూడా లేని వయస్సులో బొంబాయి లాంటి మహా పట్నానికి వెళ్ళి, బాల్టెక్స్ కంపెనీలో చేరి, తను బ్రతుకుతూ నాన్నకి డబ్బు పంపిన ఆమె ఎంత ఆదర్శ వనిత! చలానికి యిల్లు కొనిపెట్టింది ఆమె. చెల్లెలు 'చకచక'ని ఆదుకుని, తల్లిలా చూసుకుంటున్నది ఆమె. వజీర్ రెహ్మాన్ చనిపోతే, చకచక (చిట్టిపాపని) దగ్గరకు తీసికొని, ఆమె చిన్న పాపను చదివించి, ఉద్యోగాన్నిప్పించే బాధ్యతను తీసుకొన్నది ఆమె.

మాలతీ చందూర్ చెప్పారు 'చలం శతజయంతి చేస్తున్నాం, రమ్మని మదరాసులో పిలిస్తే, 'మా నాన్నంటే మాకు అసహ్యం, మేమురాము' అని ఆ కూతుళ్ళిద్దరూ అన్నారని.

'మా నాన్నంటే మాకు అసహ్యం, మేము రాము' అని ఆ కూతుళ్ళిద్దరూ అన్నారట.

ఇవన్నీ ఏకరువు పెడుతూ చలాన్ని బాధ్యతారహితుడిగా, పిల్లల ప్రేమను కూడా కోల్పోయిన ఒంటరిగాడిగా చిత్రించాలని కాదు నా ఉద్దేశ్యం.

ఈ వాస్తవాలన్నీ పరిశీలించుకొని, చలం రచయితగా ఎందుకు గొప్పవాడో అందుకు ఆయనకి గుడి కట్టండి. ఒకసారి తేనెలోను, ఒకసారి విషంలోను ముంచి రాసిన ఆయన కలాన్ని జన్మ జన్మలకు



పూజించండి. మహోద్యమ కర్తగా, ఎన్నో ప్రక్రియలకు నాందిపలికిన నైరాశికుడిగ్గా, వ్యక్తి స్వేచ్ఛను ప్రతిపాదించిన సంస్కర్తగా వేనోళ్ళ పొగడండి. కానీ సాధించలేకపోయిన వాటికీ, ఆయనే చెప్పుకున్న ఆయన వైఫల్యాలకీ కూడా మీ పరిశీలనల్లో చోటివ్వండి. ఆయన కన్న పసిపాపలు ఐదుగురు అమాయకంగా నోట్లో వేలువేసుకుని, తమ నీలికళ్ళతో నాన్న కళ్ళల్లోకి చూసినప్పుడు, ఎర్రని బోసినోళ్ళు విప్పి 'నీవే నా రక్షకుడవు' అన్నట్లు నవ్వినప్పుడు చలం మనస్సులో ప్రేమ పొంగలేదా? చదువు, ఉద్యోగం, పెళ్ళి, కొంతవరకు ఆస్తి తన పెద్దలు తనకిచ్చినప్పుడు, తాను పిల్లలకు అవి యివ్వాలనే కర్తవ్యం అంత మేధావికి స్ఫురించలేదా?

ఇవన్నీ గత ప్రశ్నలు, శుష్కప్రశ్నలు. ఆయనే జవాబులిచ్చుకొన్న ఆచరణ దూరమైన జీవన ఘట్టాలు. ఎవరి సౌభాగ్యానికి వారే కర్తలు. ఎవరి రాతలను వారే అనుభవిస్తారు - అని యీనాడు మనం అనుకోవాలి.

చలం చుట్టూ అల్లిన ఒక కాల్పనికమైన దడిని చూసి, అక్కడే ఆగి పరవశం కావద్దు. ఈమధ్య ఒక సభలో యువత చలాన్ని చదివేలా చేయాలి అని ఒక ప్రతిపాదన వచ్చింది. నేను పాల్గొన్నాను ఆ సభలో. మాట్లాడాను. ఎందుకు మాట్లాడానంటే, 'చలంగారి మనమరాలు' అంటూ దానిని, ఆమె కూతురిని అతిథులుగా గొప్ప 'ఫేన్ ఫేర్'తో తీసుకొచ్చి కూర్చోపెట్టారు. కానీ 'కాసినైనా రక్తంబొట్లు నా నరాల్లోనే చలం వంశం నుంచి వున్నాయి'. ఇది చాలా చిన్న విషయమే. కానీ సభను నిర్వహించిన వారిని ఒక అబద్ధం నుంచి బయటపడేయాలని నాకు తోచి, మాట్లాడాను. నన్ను అడగలేదు మాట్లాడమని. ఇంతా ఎవరెవరో 'మేం చలాన్ని చూశాం, ఆయన మాకు నాన్న - నన్ను గారాబం చేశాడు' అంటూ తమ జ్ఞాపకాలు, 'మేం చలాన్ని చూడలేదు, కానీ ఆయన మావాడే' అంటూ కొందరు తమ ఆరాధనా తెలియచేశారు.

'కాసినైనా రక్తంబొట్లు నా నరాల్లోనే చలం వంశం నుంచి వున్నాయి' అనే వాస్తవాన్ని చెప్పాలని

అప్పుడాక డాక్యుమెంటరీ చూపించారు. అందులో చలానికిష్టమంటూ పాడిన ఎంకిపాట ఆయన ట్యూను కాదు. మరికొన్ని అబద్ధాలున్నాయి. అంటే వాస్తవానికి సంబంధించిన పొరబాట్లు.

'చలాన్ని యువత చదవాలి' అనేది ఆనాటి నినాదం. 'భారత, రామాయణాలు, భగవద్గీత చదవండి' అని మనం మనిషి, మనిషికీ చెప్తాము. అదే ధోరణిలో, ఉద్బోధించే స్వరంతో 'చలం మైదానం, అరుణ

చదవండర్రా. చదివి తరించిపోండి, మీకు ముక్తిమార్గం దొరుకుతుంది. కాకపోయినా మీరు మరింత మేలైన మనుష్యులుగా తప్పక తయారౌతారు' అని చెప్పగలమా? నేను చెప్పలేను, చెప్పను. చలాన్ని ఎందుకు చదవమని అంటున్నామో ఆ విషయంలో స్పష్టత కావాలి. ఆయన శైలినీ, తెలుగు భాష ఎంత అందంగా, ఎంత భావగర్భితంగా, ఎంత శక్తివంతంగా రాయవచ్చునో తెలుసుకోవడానికి చదవమనాలి. కథ, నాటకం, నవల, వ్యాసం, ఎంత గొప్ప శిల్పంతో సృష్టించవచ్చునో గ్రహించడానికి చదవమనాలి. మ్యూజింగ్స్ ఒక మహాకావ్యం. మనస్సులో మెదిలే ప్రతి స్పందననూ ఎల్లా గుర్తించాలో, ఎంత పరిశీలనతో మాటల్లో యిమడ్చాలో నేర్చుకోవడానికి చదవమనాలి. ప్రేమలేఖల్లోని మమతనూ, ఆవేశాన్నీ, ఆత్మార్పణనీ మననం చేసుకోవడానికి చదవమనాలి. మల్లెపూలు, బడిపిల్లలు, పంతుళ్ల ధాష్టీకం, ఆడవారి కష్టాల వర్ణన, సముద్ర ఒడ్డు, ఇసుక, వెన్నెల రాత్రుళ్ళు వంటి అనేకానేక విషయాలను గురించి ప్రకృతి శోభను మనకు దర్శనం చేయించినందుకు చదవమనాలి. అది స్పష్టంగా మన విజ్ఞాపనలో వుండాలి. ఆ సంగతే నేను చెప్పాను.

చదివి, విమర్శించడానికి, వ్యాసాలుగా, ఉపన్యాసాలుగా తమ అభిప్రాయాలు చెప్పడానికి పోటీలు పెట్టండి, బహుమతులకు నేను దఖ్ఖిస్తాను అన్నాను. ఆ పని జరిగిందో లేదో నాకు తెలియదు.

సరే, యాభై ఏళ్ల క్రితం మాటలు ఇప్పుడు తప్పుగా అనిపించక పోవచ్చును. గొప్పవారి వ్యక్తిగత జీవితాల్లోకి వెళ్లి, తప్పొప్పుల నిర్ణయం చేయకూడదు అని చాలమంది అంటుంటారు. చలం రచనల్లోని జిగికీ, నిజాయితీకి, ప్రకృతి వర్ణనలకీ, హాస్యానికీ, కవితాంబరాన్ని తాకుతుండే వచన శైలికీ ముగ్ధులైపోవచ్చును. ఆయన మాటలోని పెంకెతనానికీ, యింకేమీ దాచుకోవడానికి లేదన్నట్లు వికసించి రేకుల బరువుతో వూగే గులాబీ లాంటి హృదయానికీ - చేయెత్తి జేకొట్టవచ్చును. రంగనాయకమ్మ రచనలో 'చలం పోలిక కనుపించింది' అని నేనంటే, ఆమె మురిసింది. ఆ ప్రవాహం ఎవరికుంటుంది - ఆయన మాటల్లో ఆ 'irresistibility'ని ఎవరు కాదనగలరు?

చలాన్ని ఎందుకు చదవమని అంటున్నామో ఆ విషయంలో స్పష్టత కావాలి.

సృజనాత్మక రచయితలందరూ, ఏదో ఒక ఘట్టంలో ప్రయత్నపూర్వకం గాను, అప్రయత్నంగాను చలాన్ని అనుకరించడానికి ముచ్చుపడతారని నా అభిప్రాయం. ఆ ఛాయలు ఎంతమంది రచనల్లోనో



చూశాను నేను.

ఆయన్ని అభిమానించడం, ఆరాధించడం, వీరభక్తితో ఆయన్ని గురించి మాట్లాడ్డం, "మేము ఆ అంతః కూటమిలో వున్నాం. చలం ఆత్మని చదివినవాళ్లం, నీలాకాశంలో స్వేచ్ఛావిహంగాలుగా ఎగిరే రెక్కలు ఆయన మాకిచ్చాడు, లోకం కట్టుబాట్లు, కుళ్లిపోయిన మర్యాదలు మరచిపోతున్నాం" అనే ధోరణిలో ప్రవర్తించే గుంపుని నేను చూశాను. బాగా కళ్లు తెరచుకుని, వారి కదలికలూ, స్పందనలూ, తన్మయత్వాన్ని పరికించాను.

నిజమైన గొప్ప సందేహం కలిగింది. చలం రచయితగా మనందరిలోనూ సంచలనం కలిగించడం వరకు బాగానేవుంది. కానీ వ్యక్తిగా ఆయన ఎన్నుకొన్న జీవనశైలి ఎంతవరకు ఆచరణీయం, వాంఛనీయం అనేది ఆలోచించాలిగా! ఆలోచించామని చెప్పే సాహసం, నిజాయితీ వుండాలిగా? ఇన్నాళ్లా నాలో అవి మేల్కొలేదు.

ఏ సంస్కరణ అయినా, ఏ విప్లవాత్మక పరిణామమైనా వ్యక్తికి, ఆతర్వాత సమాజానికి లాభం, సుఖం, ప్రగతి చేకూర్చాలని నా అభిప్రాయం. ఆలోచనా ధోరణిని ప్రేరేపించడం, ఒక కొత్త మలుపుని తిప్పడం, లేచి, సుడిగాలిలా విజృంభించడం, చుట్టుముట్టడం అన్నీ అర్థం చేసుకోవచ్చును. వాటి ఉధృతం, అవి కలిగించిన తొలిమైకం తగ్గాక, ఆలోచన స్పష్టంగా సాగాలిగా?

చలం రచనల నుంచి, అవి మనకి యివ్వజూపిన సందేశం స్పష్టంగానే చూడాలి. మొదటిసారి కనబడకపోవచ్చును. రెండోసారో, మూడోసారో కనబడాలి. అది విశదీకరించుకుని, ఓహో యిదీ మన అవగాహన, యివి చదువుకోవడానికి రసరంజకంగా వున్నాయి, యివి మననం చేసుకుని తృప్తి పడవచ్చును, యివి మనం నెత్తిపై నుంచుకొని పూజించవచ్చును, యివి మనం యితరులతో పంచుకుంటూ, చెరకు పిప్పివలె అదపాతదపా రసాన్ని పీల్చుకోవచ్చును అని ఒక విభజన కలగాలి.

నేను కూడా చలం భక్తురాలినే. చదివాను, చూశాను, వాగాను, రాశాను, జవాబులు పొందాను.

దీర్ఘకాలం మళ్లీ మళ్లీ చదివి, కొత్త అర్థాలు చెప్పుకొంటూ, కళ్ళు మూసుకునో, తెరచుకునో గభాలున వాటిల్లో పడిపోవచ్చును - అనేవి వివిధ అవకాశాలు, మార్గాలు, వివిధ వ్యక్తులకున్న ఐచ్ఛికాలు.

నేను కూడా చలం భక్తురాలినే. చదివాను, చూశాను, వాగాను, రాశాను, జవాబులు పొందాను. కొన్నేళ్లు ఆ సంబంధం, సన్నిహితత్వం అల్లా కొనసాగించాను.

కానీ అంతర్గతంగా నాలో స్థిరంగా గూడుకట్టుకొన్న విషయం ఏమిటి - చలం బతుకు ఏదో ఒకటి అయింది, ఆయనని నమ్ముకొన్న వాళ్ల బతుకులు ఏదో ఒకటి అయినాయి. ఆ మార్గం మనకు అనుసరణీయం కాదు. నా చదువు, నా పెళ్లి, నా సంపాదన, నా ఆర్థిక, సామాజిక కష్టసుఖాలు - యివన్నీ ఆయన పద్ధతికి ఎన్నో యుగాలు దూరం, వాటితో ఏవిధమైన ఆచరణాత్మక సంబంధం పెట్టుకునే అవసరం లేదు అని నాకు 1960లోనే స్పష్టమైంది.

ఆయన బోధించిన 'కాముక స్వేచ్ఛ' నాకు పరమ రోత కలిగించింది. అది మానవస్థాయి నుంచి పశుస్థాయికి దిగడం అని నా చిన్న బుర్రకు తోచింది. ఒక ఉదాహరణ నా స్మరణలోకి వచ్చింది. చలం తన ఒక చెల్లెలి కూతురితో అన్నాడట.

'ఒసే, వాడు ఎర్రగా వున్నాడు, వాడితోపోతే నీకు ఎర్రని పిల్లలు పుడతారు' అని. ఆమె ఆ పని చేసింది. ఒక కూతురు, కొడుకు పుట్టారు. వారు మహమ్మదీయులో, హిందువులో తెలియదు. కొన్నాళ్లు ఆ పేర్లు, కొన్నాళ్లు యీ పేర్లు పెట్టుకున్నారు. ఆ పిల్లల తండ్రి పాకిస్తాన్‌కి వెళ్లిపోయినాడు. ఈమెకి ఆనాటి హైదరాబాదు ప్రభుత్వంలో ఏదో ఉద్యోగం దొరికింది. సంపాదించి, పిల్లల్ని పెంచుకుని, పెళ్లిళ్లు చేసి, యిల్లు, మేడలు కట్టుకుని బతుకుతోంది. ఆయన అన్నది ఎంత బాధ్యతారహితమో, దాన్ని ఆచరణలోకి పెట్టిన ఆమెది ఎంత బేలతనమో నేను గుర్తించాను. అందరూ గుర్తించి, ఆయన సలహాలోని సహేతుకతని చీల్చాలిగా!

చలానికి దేశభక్తి అంటలేదు - మాతృభక్తి లేదు - సోదర, సోదరీ ప్రేమ ఎంతవరకున్నదో తెలియదు. తన గొడవే తనది అనిపిస్తుంది. ఈశ్వరభక్తిలో పెద్దవాళ్లు ప్రశాంతిని పొందగలిగారు. ప్రశ్న లేకుండా అర్పణ చేసుకుని, చిదానందానికి చేరువైనారు. చలం వేదనతో, బాధతో, అంతుతెగని అన్వేషణలో మాట్లాడుతూనే వున్నాడు. తన రచనలతో ఈశ్వరుణ్ణి చేరుకోవాలనే చూశాడు. అనుకొన్న శాంతి దొరికిందో లేదో, తను లోకంపైన గుమ్మరించిన లక్షల అక్షరాలు వెలుగు దీపాలై యితరులకి దారిచూపాయో, నిరాశా కీలలై బాధించ చేశాయో తెలియదు. మనందరి జీవితాల్లోను అదొక పార్శ్వం. మరపురాని చలంగా నాటుకున్న ఉదంతం.

ఆయన అన్నది ఎంత బాధ్యతారహితమో, దాన్ని ఆచరణలోకి పెట్టిన ఆమెది ఎంత బేలతనమో నేను గుర్తించాను.

ఎందుకింత దీర్ఘంగా వ్రాస్తున్నానంటే చలం పేరు మీద, కలుసుకొంటూ, పిచిక, నెమలి, అవుదూడలను గురించి, పెంచిన పిల్లలు,



వారి పిల్లలూ, ఐనుక గూళ్ల గురించి చలం చుట్టూ వున్న పరిసరాలు, వాటిలోని నవ్యత, చమత్కారం గురించి పదే పదే చెప్పుకొంటున్న భక్తులందరూ, మరో మాటలో ఉన్మాదులందరూ - గుర్తించవలసినది ఒకటుంది. ఆ రొమాన్సును మించి, ఆయన తత్త్వం, సిద్ధాంతం, బోధన, జీవనశైలీ వున్నాయి. వాటిని మనం అనుకరించగలమా, మనకి ఆ సాహసం వుందా - అనుకరిస్తే మనం లాభపడతామా, వ్యక్తిగతంగా సుఖం, శాంతి పొందుతామా అని ఆత్మవివేచన చేసుకోవాలి.

చలం ప్రత్యక్షంగా పోరాడగలిగినన్నాళ్లు యీ ఆంధ్రదేశంలో పోరాడాడు. ఆ తర్వాత ఒక మూలకు ఒదిగిపోయి ఆత్మవిమర్శలో, భగవదన్వేషణలో పడి ఆ అరుణాచలం కొండలో దాగివున్నాడు. 58 ఏళ్లు తెలుగువారితో, తనవారితో ఘర్షణ అయితే, 27 ఏళ్లపాటు సుదూర ప్రదేశంలో, విసరి వేసిన పరాయి దేశంలో బతికాడు. ఆయన గొప్ప లేఖా రచయిత కనుక ఎందరితోనో సంభాషణలు కొనసాగాయి. వల్మీకంలో మునిలా కాక, మనిషిగా మనుష్యుల్ని స్పృశిస్తూనే వున్నాడు.

పెద్దవాడిని, నన్ను నిష్కల్మషంగా, నిస్వార్థంగా, ప్రతిఫలం ఆశించకుండా ఒక బాలికగా ప్రేమించిన చలాన్ని నేను యివాళ యిల్లా నానామాటలూ అనడం ఉచితంకాదు. ఇన్నాళ్లు ఆ సంకోచం నాలో వుండబట్టే కాబోలు నాలోనే ఆ వుత్తరాలు, వాటిలో నామీద అవ్యాజంగా కురిపించిన ప్రేమను లోకం నుంచి దాచాను. కానీ నా అరవై ఏదో ఏట, గొంతువిప్పి చెప్పాలనుకొన్నాను. 'నిన్ను దగా చేస్తున్నాను. నీ ప్రేమను కిందువేసి మాటలంటున్నాను. క్షమించు తాతయ్యా' అంటున్నాను. ఈ మాటలు రాస్తోంటే నా కన్నీటి చుక్కలు కాగితం మీద పడుతున్నాయి.